శ్రీ

# మాయావాదోత్పత్తిక్రమము.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జ్యేష్ఠపుత్రుఁడగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1926.



వెల అ. 0—8—0

# మాయావాదోత్పత్తిక్రమము.

పురాతనార్యులు పంజాబుఁ జేరకమున్ను బహుదినములక్రిందట వారు ప్రకృతి చిత్రమహిమలఁజూచి యవి శక్తులనియెన్ని వానిని గౌరవించి నుతింప సాగిరి. అప్పటిలో వారొనరించు పూజలన్నియును వాగ్రూపకమైన నుతులుగ నుండెను. పిదప నగ్నిపూజ ప్రారంభమాయెను. అపుడగ్నికిఁ బాలు, పెరుఁగు, నెయ్యి మొదలగు వస్తువులు బలియియ్యసాగిరి. ఈ పూజలన్నియు నమాయకమైనవిగను నహింసారూపముగను నుండెను. పిదప రాజ్యస్థాపనములు పురోహిత వర్గ మేర్పడుటయు సంభవిల్లెను. పురోహితుల ప్రాబల్యానంతరము హింసారూపకములగు బలులిచ్చి యజాశ్వమేధాది యజ్ఞము లారంభమయి ప్రబలించెను. అక్కాలమునకు నార్యులలో ననేకులందుఁ గార్యకారణములను విమర్శించు బుద్ధి యుత్పన్నమయి ప్రపంచోత్పత్తి యెటులయ్యెననియుఁ దా మర్చించు శక్తులకన్నిటికిని మూలశక్తి తత్వ మొకటి యుండవలెననియు నాలోచించి తుదకు బ్రహ్మమను దైవశక్తి యొకటి యున్నదనియు నా దైవశక్తినుండి యుద్భవించినదే ప్రాపంచిక వస్తుసముదాయమంతయుననియు నిర్ధరించిరి. ప్రారంభమునఁ జిత్రమహిమల నుతించు చుండినవారు ఋషులైరి. పిదప ననేకవిధములగు నాగమవిధులనుఁ గల్పించినవారు బ్రహ్మవాదులైరి. పిదప బ్రహ్మమను శక్తియొకటి సర్వాధారమైన సత్యశక్తి యనియు నాశక్తి సత్త్వమే ప్రపంచ వస్తుతత్వమనియు నిర్ధరించినవారు పరిణామ వాదులైరి. వీరు వేదవాదులకు విరుద్ధులు కాకపోయినను జనుల మానసములందు నభిప్రాయ భిన్నతలు గలుగుటచే వేదవాదుల మతము సన్నగిల్లెను. పరిణామవాదులను, వేదవాదులు శత్రువులుగఁ జూచుచుండిరి. వేదవాదులు తామొనరించు నాగమవిధులఫలము గుడ్డిదారిగ నూహించుచుండిరిగాని కారణ కార్యరూపకమున జనులకు సమాధానమియ్యఁజాలకైరి. పరిణామవాదులు ప్రతియొక కర్మము యొక్క రహస్యార్థములఁ దెలిపి జనుల జ్ఞానాభివృద్ధికిఁ గారణులైరి. ఈ మతము ప్రబలెను. ఇటులుండఁ గపిలాచార్యులవారు తమ సాంఖ్యమతమునకుఁ బ్రాశస్త్యముఁ గలిగించి పరిణామ వాదమతము నణఁచిరి. ఈ సాంఖ్యవాదు లీశ్వరుని నిరాకరించి "ప్రకృతి పురుష" యను ద్వంద్వరూపకమునైన రెండుతత్వములు గల్పించి ప్రకృతి, లేక, ప్రధానమను తత్త్వమునుండి యిరువదిమూఁడు తత్వములుత్పన్నమయ్యెననియుఁ బ్రధాన పురుషయుక్త పంచవింశ తత్త్వజ్ఞానమే మోక్షమనియు మతమేర్పఱచిరి. ఇదియ, నిరీశ్వరవాదము. ఈ కాపిలమత మెటులైన నుండనిండు వీరొనరించిన హేతువాదమును, సిద్ధాంతము లొనర్చు వాదపటిమయును,

విశేషభాగ మంగీకరించిరి. ఇటులుండఁ గాణాదులనువారు వైశేషిక మతమొకటి కల్పించి వ్యాపింపఁజేసిరి. ఈ మతమునందు శాంతస్వభావమూర్తియగు దైవమొకఁడున్నవాఁడనియుఁ బ్రపంచమణువుల సంయోగఫలమనియు నాలుద్రవ్యముల సత్యజ్ఞానమే మోక్షమనియు స్థాపింపఁబడినది. పై సాంఖ్య వైశేషిక మతముల వ్యాపనచే పరిణామవాదుల ప్రాబల్య మొంతోకాల మడఁగియుండి పూర్వ మీమాంసక మత ముద్భవించినతోడనే మఱలఁ దలఁజూపఁ బ్రారంభించెను. అయిన నా పరిణామ వాదమతములోఁ గొన్నిలోపము లుండినందున నా లోపములనెల్లఁ జక్కఁబఱచి మఱికొన్ని యంశములను జేర్చి "మాయ" యను సిద్ధాంత మేర్పఱచినందున మాయావాదము రూఢికివచ్చెను. "మాయ" యననేమి మాయావాదమతమన నేమి యను విషయము చర్చింపకమున్ను పరిణామవాదములోనుండిన లోపము లెవ్వియనునది సంగ్రహముగ వ్రాసెద.

(1) ఉపనిషత్తులలోనేమి వేదముల జ్ఞానకాండలోనేమి, "ఏకమేవాద్వితీయం" యనఁగా దైవమొక్కఁడే రెండవదెద్దియును లేదని పలుకఁబడినది. అయినఁ బరిణామవాదములో ద్వైత మారోపింపఁబడినది.

(2) పరిణామవాదము కారణ కార్య సిద్ధాంతమునకుఁ బ్రారంభముననే విరోధించుచున్నది. కారణ, మే స్వభావముగలదియో కార్యము నదేస్వభావముగ నుండవలెననునది సిద్ధాంతముగదా? ఈ సిద్ధాంతమునకు భంగముగ దైవికద్రవ్యమునుండి ప్రకృతివస్తు సృష్టికలిగెననుటఁ పరిణామవాదదోషము.

(3) ఈ పరిణామవాదమునుండి ప్రపంచములో మన మనుభవించు మేలు కీళ్లకుఁ దగుమయిన కారణములు చూపఁబడలేదు. దైవ మన్నిచోట్ల నుండువాఁడైనచోఁ బ్రపంచములోని దుఃఖములు చూడఁడా? దైవము జ్ఞానస్వరూపుఁడు గదా? ప్రపంచదుఃఖములను దెలిసికొనఁడా? జీవులకు మరణమేల గలిగించెను?

పరిణామ వాదమునందు వీనికి గారణము లుండలేదు. ఈ వాదమునకు వికారవాదమని సైతము పేరు. ఈ వాదమును జక్కపఱచుటకునై మాయావాద ముద్భవిల్లెను.

ఈ సిద్ధాంతమురీతిగ పిండబ్రహ్మాండములోని ద్రవ్యములెల్ల (1) పారమార్థికము, (2) వ్యావహారికము, (3) ప్రాతిభాసిక"ములని మూఁడువిధములుగ విభజింపఁబడినవి. (1) పారమార్థికమనునది సత్యము. ఎల్లకాలముండునది. మార్పులు లేనిది. (2) వ్యావహారికమనఁగ మనకంటికిఁగాని మనమునకుఁగాని నిజముగ నగ

పడుచు నామరూపాదులందుచు మార్పులుజెంది వేఱు నామరూపములంది తుదకు నశించునది. (3) ప్రాతిభాసికమనగా వ్యవహారముననుండు నొకవస్తువు వ్యవహారములోనుండు మఱియొకవస్తువుగ నగపడుట. శుక్తిరజితము, రజ్జుసర్పము, మృగతృష్ణజలము, దీనికి నుదాహరణములు. పారమార్థికమనునది బ్రహ్మమేను. మిగత వస్తువులు వ్యావహారికములు. మొదటికి సదాసత్యము. రెండవది వ్యావహారిక సత్యమైనను, నసత్యమేను. మూఁడవది భ్రాంతిగ, నసత్యము. ఇది రూపైక్య కారణ జనిత భ్రాంతి. మానసేంద్రియ దౌర్బల్యము. వ్యావహారి కాసత్యము. జ్ఞానేంద్రియ దౌర్బల్యము. ప్రతిభాసికము వ్యావహారికవస్తు నిశ్చయజ్ఞానమున మిథ్యయగును; వ్యావహారికవస్తు సృష్టి సత్యాసత్యముల మధ్యనుండునది. అసత్య పరిణామములగు వ్యావహారిక ప్రాతిభాసికముల సృష్టి మాయాజనితఫలమని మాయావాదుల సిద్ధాంతము. "మాయ" యననేమి? అది చేతనపదార్థమా! అచేతనమా? ఈ విషయములుగొన్ని సంగ్రహముగ నిటు వ్రాయఁ బూనెద.

ఈ మాయయనునది పరబ్రహ్మమునందుండు "సహజశక్తి" ఆరోపిత శక్తికాదు. ఈశక్తి విభజింపశక్యముగాని సూక్ష్మము. సర్వభక్షకుఁడగు నగ్ని జ్వాలలకు వ్యాపించి భక్షించు శక్తియటులున్నదని మనభావనలోఁ గలుగునో, యదేరీతిగ పరబ్రహ్మమునందలి శక్తియొక్క బల మీ ప్రపంచమున స్పష్టముగ నగపడుచుండును. అయిన నీశక్తి పరబ్రహ్మమే యనుటకును రాదు పరబ్రహ్మము నుండి భిన్నమని యనుటకును రాదు. ఎందుకనఁగా అగ్నియందుఁగల సర్వభక్షకశక్తి యగ్నికాదుగదా? అది భిన్నతత్త్వమని మనమెన్నినచో దానిభిన్నస్థితి యెట్టిదను నదియుఁ దెలుపసాధ్యముకాదుగదా? "వస్తువు-వస్తుశక్తి" యెటు లొకటియుఁగాక భిన్నమునుగాకయుండునో యటులనే పరబ్రహ్మమును మాయయు నొకటియును గాదు వేఱునుగాదని తెలియవలెను. రెండును నవ్యక్తములేను కావుననే యనిర్వచనీయములు. వ్యావహారికభాషలో వానినిఁ దెలుపసాధ్యముగాదు. జ్ఞానచక్షువులంజూచి యనుభవింపఁదగినవి. వ్యావహారికభాషలో శాస్త్రజ్ఞులుచేసిన పరబ్రహ్మము యొక్క వర్ణన, యజ్ఞులరుంధతీన్యాయమునఁ జాయచాయఁగఁ దెలిసికొనుటకునై వర్ణించిన విషయమని తెలియవలెను. ఈ విషయముఁ దెలియుట కష్టతమము. ఆధిభౌతిక శాస్త్రజ్ఞులిప్పటికిని గొన్నివ్యక్తములగు వస్తువులు శాకాదితరగతికిఁ జేరినవియా లేక క్రిమికీటకాదివర్గమునకుఁ జేరినవియా యనునది తెలియక యున్న వారు. వ్యక్తసూక్ష్మ పదార్థముల విమర్శనకే యిన్నికష్టములుండ నిఁక నవ్యక్తవస్తు విమర్శన యెంతకష్టమో దైవమెఱుంగును కావుననే ఋగ్వేదఋషులీ సృష్టిరహస్యము

దైవమున్నకైనఁ దెలియునో తెలియదోయని సందేహించినారు. ప్రకృతిపురుషుల తత్త్వమతిసూక్ష్మతమముగ నున్నందున రెండును నొక్కటియయని కొందఱు నిర్ధరించి సర్వసృష్టియుఁ బ్రకృతినుండియె కలిగినదని పరబ్రహ్మమును నిరాకరించు నాస్తికులయినారు. ఈ మాయాశక్తికే సాంఖ్యులు ప్రధానమనియును వేదాంతులుప్రకృతియవిద్యయనియు ననేకనామములిడినారు. మాయ, "సత్తునుగాదు, అసత్తును గాదు" అని చెప్పఁబడుటకుఁదగినట్టిదియొక సూక్ష్మతమమైన యవ్యక్తతత్త్వమని యనికొందుము. ఏవస్తువును లేకయే, దైవము ప్రపంచమును సృష్టించెనని హీబ్రూజాతివారు పలికినరీతిఁగాక, మనవేదాంతులీమాయాతత్త్వమునుండి యేసర్వప్రపంచము సృష్టింపఁబడెననుటలో నేవిరుద్ధమునుండదు. "పరబ్రహ్మము, చైతన్యస్వరూపమునుగాని జడవస్తువుగదా, అట్టివస్తువుకు సృష్టిసంకల్పమెట్లుగలిగె" నని కొందఱాక్షేపింతురు. ఇది సాంఖ్యశాస్త్రమునుండి గలిగిన యజ్ఞానఫలము. మాయావాదులు పరబ్రహ్మము సచ్చిదానందమూర్తియనియును నిత్యశుద్ధబుద్ధముక్తుఁడనియునుఁ బలికెదరు గావున పై యాక్షేపణమునకు మార్గము లేదు. కావున దన స్వాభావిక మాయాశక్తికిఁ జలనము గలిగించుటయుఁ దినప నామాయాశక్తి యనేకరూపములగు వస్తువులుగలిగించుటయు దైవముయొక్క యిచ్ఛాశక్తి, లేక, సంకల్పమని పిలువఁబడుచున్నది. స్వాభావిక మాయాశక్తికిఁ జలనముఁగలిగించిన నిమిత్తకారణమునఁ బరబ్రహ్మమునకు సృష్టికర్తృత్వ మారోపింపఁబడినది. సాంఖ్యులు పురుషుఁ డుదాసీనుఁడందురు. దానిని మాయావాదులు సమ్మతింపరు. పరబ్రహ్మము నిష్కల్మషచైతన్య స్వరూపముగదా? అందులో కల్మషఖనియగు మాయ యెటులుండునని కొందఱాక్షేపించెదరు. మేమిదివఱలోఁ బరబ్రహ్మముయొక్క శక్తి మాయయని పలికినాము. ఇఁక మాయయొక్క స్వాభావికమగు శక్తినుండి సృష్టిప్రారంభమైనది కల్మషాకల్మషములు మాయాశక్తివిశేషణములు. ఈ మాయాశక్తి దైవశక్తితో గూడియుండును. అకల్మషము దైవశక్తి. కల్మషము మాయాశక్తి. ఈ రెండుశక్తులు భిన్నముగ నుండునవికావు. కల్మషవృత్తినిఁ దొలఁచి యకల్మషవృత్తిలోఁ గలపుట యమానవకర్తవ్యము, కల్మషమనునది యజ్ఞానము. ఈ యజ్ఞానమెటువచ్చెనన నది మాయాశక్తికిఁగల యొకలక్షణము. అటుపలకనిచోఁ బరబ్రహ్మశుద్ధత్వమునకే సందేహముకలుగును. పరబ్రహ్మములే రెండు కావలసివచ్చును. "జ్ఞానపరబ్రహ్మము. అజ్ఞానపరబ్రహ్మము" అని పరబ్రహ్మములుగ నుండవలెను. ఇది, యేమతమువారి సిద్ధాంతమునుకాదు. కావున నజ్ఞానమనఁగా నవిద్య, మాయాశక్తి యని చెప్పుటయ సరియయినకారణమని చెప్పఁదగును.

మాయాశక్తి తన యథేచ్ఛలో ననఁగా పంచమహాభూతము లింకను జనింపకమున్ను సూక్ష్మతమమై పిదప సూక్ష్మతరమై సూక్ష్మమై యాకాశాది పంచమహాభూతము లుద్భవించుటకుఁ గారణమాయెను. ఈ మాయాశక్తియొక్క స్వభావము నైజతత్త్వములందు మార్పులు చేయుట. ఇట్టిమార్పుల చేతనే ప్రపంచ మాయెను. ఈ తత్త్వము లెవ్వియును శాశ్వతముగ నొక్కరూపమున నిలుచునవి కావు గనుక నివియన్నియును మిథ్యలని మాయావాదులు పలికెదరు. మిథ్య శబ్దార్థమును దెలియక కొందఱు వితండవాదములు సేయుచున్నవారు. ప్రపంచములోఁగల సర్వవస్తువులును సూర్యచంద్రాది గ్రహములతో సైతము కాలానుసారముగ మారుచుండును. ఇది మాయాశక్తి చిత్రమహిమ. పుట్టుటకుఁ బ్రారంభ మెట్టి మార్పునకు నంత్యమెట్టిదియనుట తెలుపుటకు రాదు కావుననే యాద్యంతములు లేనివని జ్ఞానులాడిరి.

ఈ మాయయొక్క శక్తియొక స్వాభావిక లక్షణమైంద్రజాలము. ఈ శక్తిచే జనులీప్రపంచమున్ను ప్రాపంచికవస్తువులు సర్వమున్ను సత్యములని నమ్మెదరు. సత్యమనినమ్మి వాని నందుటకు సర్వప్రయత్నములు సేయుచుందురు. తుదకు నవి యసత్యములగును.

మాయకును, నవిద్యకును, భేదమేమియును గీతలోనేమి, వేదాంత సూత్రములో నేమి చూపఁబడలేదు. ఉత్తర వేదాంతగ్రంథములలో మాత్ర మీరీతిగఁ దెలుపఁబడినది. ఆత్మయును బ్రహ్మమును మూలమున నొక్క స్వరూపముగనున్నను నాచిత్స్వరూప బ్రహ్మము మాయలోఁ బ్రతిబింబించినపుడు సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి నిర్మాణమగును. మఱల నామాయ రెండువిధములగును (1) మాయ (2) అవిద్య. త్రిగుణములలో శుద్ధసత్త్వ గుణమెపుడుత్కృష్టతఁ జెందునో యపుడది మాయయనఁబడును. దానిలోఁ బ్రతిబింబించిన బ్రహ్మము సగుణస్వరూపియగు నీశ్వరుఁడగును. ఆ సత్త్వగుణ మితరగుణ మిళితమై యించుక యశుద్ధమైనపుడది "అవిద్య" యనిపించుకొనుననియు దానిలోఁ బ్రతిబింబించిన బ్రహ్మము జీవుఁడనియుఁ బలుకఁబడినది. పై వర్ణనను బట్టిచూడ మాయ, యీశ్వరోపాధియనియును "అవిద్య" జీవుని యుపాధియనియును దెలియవచ్చుచున్నది. "అవిద్యా" యనుశబ్దము గీతలోలేదు. శ్వేతాశ్వతరోపనిషత్తులోనున్నది.

"అవిద్య" యనఁగా ఈశ్వరస్వరూపమును గప్పివేసి యనేకవిధ విచిత్ర పదార్థములను జీవునకు స్ఫురింపఁజేయునది. అవిద్యాదులచేఁ గప్పఁబడి

నవియే జీవుఁడు. ఈ యవిద్య యీశ్వరోపాధియగు మాయావికారము. ఇదిసత్త్వ రజస్తమోగుణ రూపమైయుండును. అవిద్య సమష్టిని నొక్కటేయైనను ననేకాంతఃకరణములుగ మారును. వానియందు సంగతమైన బ్రహ్మచైతన్య మనేకజీవులుగ భాసమానమగుచుండును. నిజముగ జీవుఁడొక్కఁడేను. అవిద్యాకామ కర్మాదులతోఁ జేరినది జీవచేతన్యము. అవిద్యకు రెండుశక్తులున్నవి. ఆవరణశక్తి, విక్షేపశక్తి. ఆవరణశక్తి వస్తువుయొక్క స్వరూపమును గప్పివేయును. విక్షేపశక్తి, యొకవస్తువును మఱియొకవస్తువుగ నగపడఁజేయును. ఈ విక్షేపశక్తి జీవన్ముక్తునందు సైతము ప్రారబ్ధసమాప్తివఱకు నుండును.

మాయ:—ఇది యిట్టిదియని వర్ణింప శక్యముకాదు. కావుననే యనిర్వచనీయము. బ్రహ్మముకంటెను వేఱనిగాని వేఱుకాదనిగాని తెలుపరాని యొకభావరూపమగు పదార్థము. ఇది శుద్ధ సత్త్వగుణముతోఁగూడి, యీశ్వరాధీనముగనుండును. ఈ మాయ సత్త్వరజస్తమో గుణాత్మకమైనను, శుద్ధ సత్త్వాన్వితమై ఈశ్వరుని స్వరూపముగ నగపడును. ఈశ్వరతత్త్వమీ మాయచేఁ గప్పఁబడినకతంబున నీశ్వరునందు నధ్యాసభ్రమ కలుగుటకుఁ గారణమయ్యెను. అధ్యాసమనఁగా:—నైజముగఁ దనయందులేని యన్యవస్తువుల గుణమును, దనపై నారోపించుకొనడము. ఈ యధ్యాస మహంకారాధ్యాసము మమకారాధ్యాసమని రెండువిధములుగనుండును. జీవునకు మాయ, అవిద్య, అంతఃకరణమను మూఁడావరణములుగలవని కొందఱిమతము. మాయ యీశ్వరస్వరూపమనియు అవిద్య కారణ శరీరమనియు నంతఃకరణము సూక్ష్మశరీరమనియుఁ దెలుపఁబడినది. మాయతోఁజేరినది కర్మము లేక క్రియ. అటుభావింపనిచో "సృష్టి" కలుగుట కే కారణముండదు. కావున మాయతోసైతము కర్మమనాదియని చెప్పవలసినదిగనున్నది. సృష్ట్యారంభమున మూలావ్యక్త నిర్గుణ పరబ్రహ్మము, దేశకాలాది నామరూపాత్మక సగుణముగ వ్యక్తమయి దృశ్యసృష్టిరూపముగ నగపడులాగొనరించినదెద్దియో దానినామము వేదాంతులు "మాయ" యని వాడినారు. అనఁగా నామరూపముచే "మాయ" యని యర్థము సేయనగును. మానవుల యింద్రియములకు గోచరముగాని యీ "మాయ" పరబ్రహ్మముయొక్క యతర్క్యమగు శక్తియని పిలువనగునని మాయావాదులందురు. ప్రకృతిస్వరూపమగు నీ త్రిగుణాత్మకమాయ మానవుల యింద్రియమయమై నిర్గుణబ్రహ్మమును సగుణబ్రహ్మముగ నగపడులాగున గుణము లారోపించుచుండును. ఇది యావరణ విక్షేపశక్తులఫలము.

ఈ మాయను నజ్ఞానమనియును, నవ్యాకృతమనియును, నవ్యక్తమని

యును వేదాంతులు వాడెదరు. స్వతంత్రమనియును, ప్రధానమనియును, మూలప్రకృతియనియును, ప్రకృతియనియును, సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థయనియును, సాంఖ్యాదులు పలికెదరు.

ఈ మాయ క్రియాకారి, అవ్యక్తముగ నుండినను దీనఁగార్యములు వ్యక్తములు. ఇది యనాది సాంతమైనది.

ఈ మాయావాదము వేదాంతవాదమునకు విశేషముగ భిన్నముకాదు

మాయావాద సారాంశమేమనఁగా:- ప్రపంచము బ్రహ్మమువలె సత్యము కాదు. మాయ బ్రహ్మముతోఁ గూడియున్నను నది యసత్యమేను. బ్రహ్మముకంటెఁ బ్రపంచము వేఱనుతలంపు మాయాకార్యమగు భ్రమయనియును నది బ్రహ్మ సాక్షాత్కారముచే నశించుననియును దెలుపఁబడినది. అనఁగా నిర్విశేష బ్రహ్మమునందు మాయ యవ్యాకృతమై ప్రపంచరూపముగఁ బరిణమించినదను మాయావాదము శ్రుతిసిద్ధమైనదని యనేకులు యూరోపియన్ లభిప్రాయపడినారు.

ఈ మాయావాద సిద్ధాంత ముత్పన్నమగుటకుఁ గారణములు సంగ్రహముగఁ బ్రారంభమున వ్రాయఁబడినవి. మాయావాద మేమయినదిన్ని కొంచెమయినను దెలియక మిగతవాదములు తెలిసికొనుట కష్టమని యెంచి వానినపుడు సూక్ష్మముగవ్రాసి యిపుడు వానిని విస్తరించి తెలుప నారంభించెద. పరిణామవాదానంతరమున సాంఖ్యసిద్ధాంత మేర్పడెనని నేనిదివఱలోఁ దెలిపినాను. సాంఖ్యశాస్త్రోద్దేశము మానవుఁడెటుల దుఃఖపరంపరలనుండి తప్పించుకొనునను విషయము నిర్ధరించుట కపిలాచార్యులు తమశక్తినంతయును వెచ్చించి యాలోచించి ఈశ్వరతత్త్వము తర్కప్రమాణములరీతిగఁ దృప్తికరముగ నిర్ధరింపఁజాలక యీశ్వర తత్త్వస్థితికి ప్రమాణములులేవనిపలికి యీశ్వరతత్త్వమునువదలి జగత్సృష్టికిఁ జక్కనిసిద్ధాంతమొనర్చిరి. ఈ సిద్ధాంతములోఁ గొన్నిలోపములున్నను వానినన్నియును నొక్కొకటిగ సవరించికొని మిగతసిద్ధాంతములు పుట్టెననుటకు నేసందియమునులేదు. దుఃఖములు (1) ఆధ్యాత్మికము (2) ఆధిభౌతికము (3) ఆధిదైవికము.” అని మూఁడువిధములు. ఈ దుఃఖములబాధ పురుషునకు నంటనట్టుల వానినిఁ దొలగింపవలెను. పురుషుని నీ దుఃఖపాశమెట్లు బంధించుననిన నజ్ఞాన కారణంబని పలుకఁబడెను.

సాంఖ్యసిద్ధాంతము రీతిగఁ బురుషు లనేకులనియును, ప్రధానవస్తు సంబంధములు కావనియు స్వతంత్రములనియును నవి సర్వవ్యాపకములనియు

చలనరహితములనియు జడములనియు వచింపఁబడినది. ఆ పురుషులు స్వయంభవు లుగను, స్వతంత్రులుగను జ్ఞానస్వరూపులుగను వర్ణింపఁబడినారు.

ప్రకృతి సత్యమైనది, అవ్యక్తమైనది, వివేకశక్తిలేనిది. సమస్థితిలోనుండు నపుడు తప్ప మిగతకాలమునందు సర్వదా చలించునది. పురుషప్రకృతులు రెండును ననాదులనియు నవ్యక్తులనియు నవిభజ్యులనియును బలుకఁబడెను. అయినఁ బ్రకృతి స్వాభివృద్ధికి సదా చలించుచుండును. ఆ యాభివృద్ధి తన లాభమునకుఁగాదు. పురుషుల యనుభవమునకు ప్రకృతియందు సత్వరజస్తమోగుణములు స్వాభావికముగఁ గలిగియున్నవి. ఈ త్రిగుణలక్షణములు వేఱుగ వ్రాయఁబడును.

సాంఖ్యులకుఁ బ్రత్యక్షాను మానాప్తవచనములనునవి మూఁడే ప్రమాణములు. ఆప్తవచనములన వేదవచనములని వారియర్థముగాదు. వేదములనాదియనియు దైవవచనములనియు వారు నమ్మరు. అందునఁ గర్మకాండమును బొత్తిగనమ్మరు.

పైన వ్రాయఁబడిన త్రిగుణకృతకర్మములు మనస్సును బంధించు చుండుననియు నట్టి బంధయుక్త మనస్సాత్మయందుఁ ప్రతిబింబించుటచేఁ బురుషుఁడు తానను బంధింపఁబడినట్టు లెన్నుననియు సాంఖ్యులు కొందఱాడెదరు.

ప్రకృతి సర్వశక్తిగలతత్త్వము. త్రిగుణాత్మకము. అది స్వేచ్ఛగఁ దన శక్తి నగపఱచును. జ్ఞానహీనమైనను దనకుఁదానే తనస్వాభావిక శక్తిచేఁ జలించును. తప్పుమార్గముపట్టదు, అపుడుసృష్టి ప్రారంభమగును. ప్రకృతినుండి "బుద్ధి" పుట్టును. ఇది మంచిచెడ్డల వివేచించుజ్ఞానశక్తి; ఇది స్వచ్ఛతత్త్వముగాన మహత్తని పిలువఁబడును. దీనినుండి "అహంకార" తత్త్వము జనించెను. ఇది "నేను" "నాది" "నాదికాదు" అని వేఱుపఱచుతత్త్వము. ఇది యనేక సుఖదుఃఖములకు మూలాధారమయినది. ఈ "అహంకార"ము నుండి పంచ తన్మాత్రలు గలిగెను. ఇవి శబ్దస్పర్శ రూపరసగంధములను సూక్ష్మతత్త్వములు సామాన్య మానవ దృగ్గోచరములుగావు. ఈ యేడు తత్త్వములున్ను ప్రకృతి జన్యములగుటయగాక యితరతత్త్వముల జనింపఁజేయు సామర్థ్యముగలవి. ఈ యేడుతత్త్వముల స్వేచ్ఛాచలనమువలనఁ మిగత పదునాఱు తత్త్వములు జనించెను. అవి జనించినవిగాని జనింపఁజేయు సామర్థ్యములేనివి. అవి యెవ్వియనః- పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశములను 5 మహా భూతతత్త్వములు.

చక్షు శ్రోత్ర ఘ్రాణ జిహ్వా త్వక్కులను 5 జ్ఞానేంద్రియములు.

వాక్పాణి పాదపాయూపస్థలను 5 కర్మేంద్రియములు.

దీనికిఁ జేరికగ మనోతత్త్వమొకటి జనించెను.

పంచమహాభూతములు పంచతన్మాత్రలచే జనింపఁబడినవి. జ్ఞానేంద్రియ పంచకమున్ను కర్మేంద్రియ పంచకమున్ను మనస్సున్ను నహంకారతత్త్వముచే జనింపఁబడినవి. ఈ మనస్సను తత్త్వమే పైన పలుకఁబడిన యాధివ్యాధుల దుఃఖ వాసనల బంధింపఁబడి పురుషునిపైఁ బ్రతిబింబించునది. దీనినుండి ముక్తినందవలె ననునదియే సాంఖ్యుల ముఖ్యసిద్ధాంతోద్దేశము. ఈ తత్త్వములలోఁ గొన్ని మానవుల దృగ్గోచరములుగావున బ్రత్యక్షప్రమాణముల సిద్ధపడుననియు మిగ తవిజ్ఞాన దృగ్గోచరములుగావున ననుమాన ప్రమాణముపై నిర్ధరింపఁదగినవనియుఁ దెలుపఁబడినవి. ఇఁక నిరువదియైదవ తత్త్వమగు పురుషుఁడు జనించినవాఁడునుగాఁడు జనింపఁ జేయువాఁడునుగాడు. అయినను బ్రకృతి తనశక్తిచే సృష్టించిన వస్తు సముదాయ లాభము తానే యనుభవింపఁజాలని కారణంబునను ననుభవించువాఁడు లేనపుడు ప్రకృతి సృష్టి వ్యర్థమగునను కారణంబునను ననుభవించు తత్త్వమొకటి యుండవలెనని పురుషుఁడు గల్పింపఁబడెనని సాంఖ్యశాస్త్రమున వచింపఁబడినది. ప్రకృతి జడమైనందున ననుభవింపఁజాలదు. పసుపునించినబండి పసుపును మోసికొనిపోవడము తన యుపయోగమునకుఁ గాదుగదా; ఆవు పొదుగులోఁ బాలునించికొనుట దూడయుపయోగమునకుగాని తనయుపయోగమునకుఁ గాదుగదా? పురుషుఁడు చలనములేని జడమాయెను. ప్రకృతియును జడతత్త్వమేను. అటులున్నపుడు జడప్రకృతికి చలనశక్తి యెటుకలిగెననినఁ బురుష సంయోగమునుండియని పలికిరి. పురుషుఁడును జడుఁడుగదా? ఒక జడశక్తి మఱియొక జడశక్తికిఁ జలనంబుఁ గల్పింప శక్యమాయని ప్రశ్నించినచో, సూదంటుతాయి జడమైనను, మఱియొక జడపదార్థమగు నినుమును జలింపఁజేయదా? పసుపువర్ణముగల యొకవిధమయిన రత్నము తృణమును జలింపఁజేయదాయని బదులిడెదరు.

జననము మరణము మొదలగు స్థితులు వేఱువేఱుగ నగపడుచున్న కారణంబునఁ బురుషులనేకుల నిర్ధరించిరి. అటుకానిచో నొకఁడు పుట్టినపుడు సర్వులు పుట్టవలసివచ్చును. ఒకఁడు చచ్చిన సర్వులు చావవలసివచ్చును. ఒకనికి వ్యాధి కలిగిన సర్వులకు వ్యాధి కలుగవలసివచ్చును. ఒకఁడు ముక్తుఁడైన సర్వులు ముక్తులుకావలసివచ్చును. ఇట్టి యనర్థము లనేకములు కలుగవలసివచ్చును కావునఁ బురుషు లనేకులని నిర్ధరింపఁబడినది. పురుషు లనేకులయినను ప్రకృతిమాత్ర మొకటేను. ఒకటయినచో ననేకవిధ వ్యక్తస్వరూపములుగ నగపడుచున్నదియే యని ప్రశ్నించినచోఁ బ్రకృతి త్రిగుణాత్మకమైనదనియు నాగుణముల మహిమచే ననేక

విధములగు వ్యక్తస్వరూపము లగపడఁజేయుననియుఁ బలికిరి.

సాంఖ్యులు పునర్జన్మము విషయములో నీవిధముగఁ బల్కుచున్నారు.

మనోబుద్ధ్యహంకారములును పంచతన్మాత్రలును గూడి లింగశరీరమై స్థూలశరీర నాశనానంతరము పురుషునితోఁ గూడ మఱియొక స్థూలశరీరములోఁ జేరి జన్మమెత్తుచుండునని నిర్ధరించినారు. లింగశరీరము స్థూలశరీరమునకంటెను హెచ్చు శాశ్వతముగనుండు ననియు నవ్యక్తమైనదనియు, శరీరముచేఁ గట్టఁబడక శరీరములోనే స్వతంత్రముగ నుండుననియు నీ శరీరము తా ననుభవించునది కాకపోయినను నీతిస్వభావముకలది యనియుఁ బలికిరి. ఈ లింగశరీరము పురుషునిఁ జుట్టియుండుననియు స్థూలశరీరమునుండియు లింగశరీరమునుండియు పురుషునిఁ దప్పించుట ముక్తియనియు వీరిసిద్ధాంతము.

పైన వ్రాయఁబడిన సాంఖ్యసిద్ధాంత సంగ్రహమునుండి మనము గొన్ని విషయములు గ్రహింపనగును.

(1) సృష్టిశక్తిగల ప్రకృతి (2) సృష్టిశక్తిలేని వికృతి (3) సృష్టింపఁబడినవయ్యును తాము నను సృష్టించుశక్తిగల వికృతులు (4) సృష్టింపఁబడినదియునుగాక సృష్టించు శక్తియునులేక యుండునది.

(ఎ) సర్వసృష్టికిని మూలమైనది ప్రకృతి మొదటిది.

(బి) బుద్ధ్యహంకార పంచతన్మాత్రలు తాము ప్రకృతివలన సృష్టింపఁబడినవయ్యును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాది షోడశవికృతులను బుట్టించినవి రెండవది.

(సి) పదునారు వికృతులు మూఁడవతరగతివి.

(డి) పురుషుఁడు:— నాల్గవతరగతికిఁ జేరినవాఁడు.

సాంఖ్య సిద్ధాంతమురీతిగ బద్ధుఁడగుటకుఁ గారణ మజ్ఞానముకాని పాపముగాదు. ముక్తికిఁగారణము జ్ఞానముగాని పుణ్యముకాదు. పుణ్యపాపములు రెండును బంధకారణములేను. పుణ్యమనునది స్వర్గసుఖము కొంతకాలమిచ్చి మఱలఁ గ్రిందికిఁదెచ్చును. అంతయగాని ముక్తికిఁ గారణముగాదు.

సాంఖ్యులు ప్రకృతిని సద్వస్తువనిరి గావున వారిసిద్ధాంతమురీతిగ సత్తు నుండి సత్తు పుట్టినట్లాయెను.

బౌద్ధులు (సౌగతులు) అసత్తునుండి సత్తుపుట్టెననిరి.

నైయాయికులు సత్తునుండి యసత్తుపుట్టుననిరి.

మాయావాదులు సత్తునుండి మాయాసృష్టియగుననియు ఆ సృష్టి యంతయును నసత్యమనిరి.

బౌద్ధులయసత్తనఁగా:— ఏమియులేదని (Void) యర్థము.

నైయాయకులయొక్కను మాయావాదులయొక్కను సచ్ఛబ్దార్థము పరమాత్మ.

ఈసత్తు అసత్తు శబ్దార్థములు ఋగ్వేదమునందనేక స్థళములందు విరుద్ధార్థములిచ్చులాగు నుపయుక్తములైనవి కావుననే యిన్ని భిన్నవాదములకుఁ గారణములాయెను.

సాంఖ్యపురుషుఁ డింద్రియాది కరణములులేనివాఁడు బుద్ధిరహితుఁడు జడుఁడై శాంతత్వమున నుండువాఁడు. ఆలోచనాశక్తిలేదు. సృష్టిస్థితిలయములలో నే సంబంధమును లేనివాఁడు. ఇట్టివాఁడు సర్వమునుజూచి యనుభవించువాఁడని పలుకుట వ్యర్థముగాని యర్థయుక్తముకాదు. పురుషుని బద్ధునిఁజేయుటకు నే విధముగను మార్గములేదు కావున వానిముక్తియనునది సకారణముగలేదు. ప్రకృతి తనకాళ్లకుఁదానే సంకెళ్లుతవిలించుకొని వదలించికొనుటకు శ్రమపడుచున్నదని సిద్ధాంత మేర్పడుచున్నది. సర్వులు నీతత్వముల జ్ఞానమార్జించుటకు ధ్యానాది యోగనిష్ఠలో నుండవలెనని సర్వులను కర్మభ్రష్టులనుజేసి సన్యాసులగునటుల బోధించుచున్నది. బౌద్ధులమత మించుమించుగనిదియేను. సృష్టిక్రమమేమో బాగుగ నున్నదిగాని దైవములేని సృష్టియయినది. ఈమతమున నాక్షేపణాంశములు బలముగనున్నవి వానినన్నిటినివ్రాయ నిదిసమయముగాదు. ప్రస్తుతాంశమునకుఁ బైన వివరించినభాగము చాలుననితోఁచెడు. ఈ సాంఖ్యుల నిరీశ్వరవాదము సంపూర్ణముగ నడచుటకున్ను వైశేషికులవాదములలోని గొన్నివిషయము లాక్షేపించుటకు వేదాంతసిద్ధాంత మేర్పడెను.

ఇఁక వైశేషిక సిద్ధాంతమునుగురించి వివరించి వ్రాయవలెననిన గ్రంథ బాహుళ్యమగును. అయినను ముఖ్యభాగములుగొన్ని సూక్ష్మముగ సాధ్యమైనంత వఱకు వ్రాయఁబూనెద. ఈ సిద్ధాంత కర్త కాణాదుఁడు. ఇది గౌతముని నైయాయిక శాస్త్రమును బోలినది కావున న్యాయశాస్త్రవర్గములోనే చేర్పఁబడినది. గౌతముని న్యాయశాస్త్రమునందు జ్ఞానవిషయములు తెలియుటకుఁగా ననేకవిధముల చర్చ జరిగి సిద్ధాంతమేర్పడినది. కాణాదుఁ డాభాగములనుగురించి సంక్షేపముగవ్రాసి

యాధిభౌతిక ద్రవ్యవిచారము హెచ్చుగ సలిపినాఁడు. ఇప్పటిలో నాధిభౌతిక శాస్త్రజ్ఞులు ద్రవ్యవిమర్శనలోఁ గనుఁగొనిన విషయములన్నియు నిప్పటికి నాలుగు వేలేండ్ల క్రిందటనే కాణాదుఁడు కనిపెట్టెను. కాణాదుని మతమురీతిగఁ బ్రపంచములోని వస్తుతత్త్వము లన్నియును నాఱుతరగతులుగ విభజింపఁబడినవి. అవి (1) ద్రవ్య (2) గుణ, (3) కర్మ (4) సామాన్య (5) విశేష (6) సమవాయ. ఈ యాఱుతరగతులకు "అభవతి" యను తత్త్వమునుఁ జేర్చఁబడినది. పై తరగతులలో నొక్కొకదానిక్రింద వచ్చునట్టి యనేకవిషయములు వ్రాయఁబడినవి. పై తత్వముల జ్ఞానమే ముక్తియని పలుకఁబడినది.

ఇది యణువాద సిద్ధాంతము. వస్తుసూక్ష్మ తత్వము లణువులనఁబడును. ఈ సూక్ష్మతత్వము లొక్కటొకటిగఁ జేరి ద్వ్యణుకములగును. ఇటులనేకములు క్రమక్రమముగఁ జేరి లోకములాయెను. ఈ తత్వములు నాలుగుతరగతులున్నవి. (1) భౌమికతత్వము (2) జలతత్వము (3) వాయుతత్వము (4) తేజోతత్వము. భౌమికతత్వము:- రూపస్పర్శ జిహ్వాఘ్రాణ లక్షణములుగలది. జలతత్వమున రూపస్పర్శ జిహ్వాలక్షణములుగలది. వాయుతత్వము. రూపస్పర్శములుగలది తేజస్తత్వము రూపమొక్కటియగలది. ఈ లక్షణములుగల తత్వములు స్వజాతి సంయోగాపేక్షలుగలవి కావుననే యాయాతరగతి యణువు లాయాతరగతికే చేరుచుండును. ఇటుచేరుట దైవశక్తియునుగాదు తత్వముయొక్క స్వాభావిక గుణమునుగాదు. అదియొక యదృష్టశక్తిలక్షణము. వెనుకటి జన్మమునఁ జేయఁబడిన పుణ్యపాప కర్మముల వాసనాశక్తికి నదృష్టమనిపేరు. ఈ మతమునందా వేశతత్వము లేదు.

హిందువుల న్యాయసిద్ధాంతములన్నియు నణువులనుండి లోకములవఱకు నభివృద్ధియగునని వ్రాయఁబడినవి. పాశ్చాత్యులలో బెక్కుసిద్ధాంతము లీరీతిగనే యుండును.

ఆత్మయున్నదనుటకు ననేకములగు కారణములు చూపఁబడినవి.

(ఎ) వస్తుగ్రహణేంద్రియములకు స్వతః జ్ఞానము లేదు కావున జ్ఞానముగల మఱియొకశక్తి దేహమునసుండవలెను.

దైవికముగాని భౌతికవస్తువుల కా జ్ఞానము లేదు. మనస్సుకూడ తమీ తరగతిలోఁ జేరినదేను. అచేతనపదార్థములకు జ్ఞానశక్తిలేదు కావున చేతనముఁగల యొకతత్వముండవలెను. అది యాత్మయేను.

(బి) ఊపిరినిబీల్చుట, వదలుట; కనుఁగవ, పెదవులు మూయుట తెఱచుట మానసచలనము; అంగవిన్యాసము; సంతోషదుఃఖములు; అపేక్షాపేసహ్యాములు, కార్యేచ్ఛయీ మొదలగునవి యాత్మయున్నదనుటకు చిహ్నములు.

ఆత్మ యున్నదనుటకు మఱియుఁ గొన్ని కారణములు చూపఁబడినవి ఈ తర్కశాస్త్ర సిద్ధాంతులహంకారతత్వ మాత్మగ భావించినటులఁ గొన్ని సూత్రము లర్థమిచ్చుచుండును. ఆత్మలనేకములని వీరిమతము.

ఆత్మ, నిత్యము, అవ్యక్తము, స్వచైతన్యము. జ్ఞానేచ్ఛాశక్తులుగలవి జడముగాదు. కావున నది జ్ఞానమూలము. తెలిసికొను శక్తిగలది. క్రియాశక్తియను దానిని గ్రహశక్తియునుగలది. కార్యమొనరించు నిచ్ఛ, సహ్యాసహ్యాములు, సుఖ దుఃఖములు, జ్ఞానము మొదలగునవి యాత్మలక్షణములు. మానస తత్వమూలకము నను జ్ఞానేంద్రియముల మూలకమునను బాహ్యప్రపంచ సంబంధము కలిగి యుండును.

ఈ మతమువారు బ్రహ్మము విషయమున గొన్నిసూత్రములు సందిగ్ధార్థములుగఁబలికి పిదప సర్వవస్తుసృష్టికిని సదృష్టమేకారణమని సిర్ధరించినారు.

వైశేషిక మతసిద్ధాంతము లన్నియును వివరముగ వ్రాయవలెననిన నది యొక్కటియే యొకగ్రంథమగును. ముఖ్యముగ మనము దీనినుండి తెలియఁదగిన విషయమేమనఁగా:—

పూర్వజన్మ పుణ్యాపాప కర్మముల ఫలమేమన జీవమనియును, మనమీ జన్మమునఁజేయు పుణ్యాపాప కర్మములున్ను మన నడవడికల ఫలములున్ను పూర్వ జన్మ ఫలమునకుఁ జేరుననియు ధ్యానాది యోగబలమున మంచిఫలము దొరకు ననియు మనకు ముక్తి దీనివలనఁ గలుగుననియు నన్నిటికిని నదృష్టమే కారణ మనియుఁ దెలియవచ్చుచున్నది. దీనింబట్టిచూడ మానవుని క్షీణోన్నతులకు వాని యదృష్టమే కారణమాయెను. ఫలాఫలములు మానవుఁడొనరించు కార్యముపై నాధారపడును కావున కర్మము సృష్టికిఁ గారణమగునుగాని దైవముకాదని యేర్పడును.

మనుజుఁడు నశింపఁ జేయఁదగిన విషయములారని వైశేషికులు నిర్ధ రించిరి. అవి యెవ్వియన:—

(1) అసత్యజ్ఞానము (2) పాపకర్మములు (3) సహ్యాసహ్యాతలు (4) కర్మాపేక్షలు (5) దుఃఖము (6) జననము. ఇక రక్షించి యభివృద్ధినందింపఁ

దగిన దెద్దియన " సత్యజ్ఞానమేను " ఆత్మయెద్ది? ఆత్మకానిదెద్ది? అనునది నిజముగఁ దెలిసికొనుట సత్యజ్ఞాన మనఁబడును. ఇట్టిజ్ఞానము ధ్యానాది యోగములచే సిద్ధించును.

సృష్టియందును మనుజులను బద్ధులఁ జేయుటయందును దైవమునకు నే సంబంధమును లేదని యర్థమిచ్చునట్టి సూత్రము లనేకములున్నవి. అదృష్టము, అణువులు, ద్రవ్యము, ద్రవ్యశక్తి, యివియే భూతకోటి యునికికిఁ గారణములని వైశేషిక మతమునుండి యేర్పడు సారము. ఇదియొక విధమైన నూతన సాంఖ్య మతముగనున్నది.

సాంఖ్యమతము కేవలముగఁ బ్రకృతికే ప్రాధాన్యమిడెను. గౌతమ కాణాదుల న్యాయసిద్ధాంతములలో నాత్మయను నామముఁ జొప్పించినను నాత్మకు నే స్వాతంత్ర్యము నెవ్విధముగను సాధింపలేదు. ఉన్నదనిమాత్రము చెప్పిరి. సామాన్య జనులకు నుపనిషద్వేదాంతములు దురవగాహములయ్యెను. బ్రాహ్మణ ముల కర్మకాండ సాంబంధికాచారాగమములు బహుకష్టము లగుటయగాక బలవ ద్బాధకములయ్యెను. కావున విశేషజనులు నాస్తికులైరి. నాస్తికమతమని యొక మతమే యేర్పడెను. ఈ మతవిషయము సంగ్రహముగ వేదోపన్యాసములలోను భగవద్గీతోపన్యాసములలో నాచే వ్రాయఁబడినవి. ఈ మతము కర్మకాండను బొత్తిగ నిరసించును. పునర్జననము లేదనను. పుణ్యాపాపములు నిరాకరించును. ప్రాణమయ కోశములు దప్ప మిగతకోశముల విచారమైనను జేయదు. ఈ మతమువారింద్రియ గోచరములయిన ప్రత్యక్షవిషయములు తప్ప తక్కినవానిని నమ్మరు. సర్వము స్వభావసిద్ధములనియును, దైవము లేదనియును వాదించుచుండిరి. ఇది చైతన్యమతమనియు లోకమతమనియు పేరు. దేహమువదలు టయనిర్వాణ మనియును పిదప నేమియును నుండదు కావున మనుజుఁడు తామనినపుడే యే గసుపాయమున నైనను సుఖమనుభవింపఁ బ్రయత్నము సేయవలెనని వీరిసిద్ధాం తము. బృహస్పతి కుత్స మొదలగు చార్వాకు లీచార్వాక సిద్ధాంతకర్తలు.

క్రీస్తుశకమునకు నాలునూర్ల సంవత్సరములకుమున్ను భరతఖండమున జనులు మతవిషయము నేకముఖముగాక కన్నమతము లవలంబించుచుండిరి. దీనికిఁ జేరికగ బ్రాహ్మణములకాలమునుండి తాంత్రికసిద్ధాంతమను పేరున శాక్తేయ మతమొకటి యుత్తరదేశంబునఁ బ్రబలియుండెను. ఈ మతవిషయము ముందు నాచేవ్రాయఁబడును. ఇట్టికాలమున గౌతమబుద్ధుఁడను మహానుభావుఁడవతరించెను. ఈ బౌద్ధమతసిద్ధాంత మెట్టులైననుండినను నీ మతమువారి నైతికవిధులుమాత్ర

మతిశ్లాఘనీయములు. శ్రీశంకరాచార్యుల వారిమతములు గ్రహించిరనునది నిజమైనచో నది యాచార్యులవారి యుదారత్వమును సర్వసమబుద్ధియును దెలుపును గాని వారియశమున కేకుందునుగలుగదు. ఆచార్యులవారీ బౌద్ధసిద్ధాంతములోని కొన్నియంశములు ఖండించినారు. కొన్నియంశములను గ్రహించినారు. అందుఁ దప్పేమున్నది? ఈ బౌద్ధమతసిద్ధాంత మేమైనదిన్ని యించుకవ్రాసెద.

ఈ మతముననుసరించి మనుజుఁడు "వివిధవస్తు తత్త్వముల యొక్కయు వానిగుణముల యొక్కయు సముదాయమని" తెలుపఁబడును. అవియెవ్వియన:—

(1) రూప (2) వేదన (3) సన్న ( Abstract ideas )?

4. సంస్కార ( Tendencies of mind ) విజ్ఞాన ( Mental powers ) ఈ వర్గము స్కంధమని పిలువఁబడును. అందురూప మిరువదియెనిమిది గుణములతో నుండునది.

1. 4. మూలతత్వములు. పృథివ్యప్తేజోవాయువులు.
   5. జ్ఞానేంద్రియములు.
   5. శబ్దస్పర్శరూపరసగంధములు.
   2. స్త్రీ పురుషులు.
   3. ఆలోచన జీవతేంద్రియము ( Vitality ) ఆకాశము ( Space )
   2. అభిప్రాయములు తెలుపుక్రమము. అభినయము మాటలు.
   7. ప్రాణియొక్క యేడువిధములగు లక్షణములు. తేలిక, నయము, (Elasticity) ఇమిడిక, బలపడడము, కాలపరిమితము, నాశనము, మార్పు.
2. వేదన. ఇదియాఱువిధములు, 5 జ్ఞానేంద్రియమువలన గలుగునవి. 1 మానసము నుండి కలుగునది.
3. సంజ్ఞ. ఇది యాఱువిధములు.
4. సంస్కారములు. ఇది యేబదిరెండువిధములు. ఇందులో మానసికసంకల్ప వికల్పములన్నియును వచ్చును.
5. విజ్ఞానము. ఇందులో నాలోచనాది విషయములు వచ్చును.

పై విషయములు మానవశారీర మానసములకుఁ గారణములు. ఇవి సత్యములుకావు. మొదటివర్గములో వచ్చునవి వస్తువికల్పములు మంచువలె నగపడి

నశించును. రెండవవర్గములోఁ జేరిన జ్ఞానేంద్రియ విషయములు నీటిబుగ్గలబలెై నటించి మాయమగునవి. మూఁడవవర్గములోఁ జేరిన భావవికారము లెండమావు లను బోలినవి. నాల్గవతరగతికిఁ జేరిన మానసిక నైతికద్యోగము లరఁటిపట్టెలబలె టొళ్లగనుంచునవి. అయిదవ తరగతికిఁ జేరిన యాలోచనాది భావము లైంద్రజాల కుని భూతాకారములను బోలినవి. కావున పైవస్తువులెల్లను మాయలు. భూతకోటి యెప్పుడున్ను మారుచుండును.

ఆత్మయున్నదనిగాని లేదనిగాని, శాశ్వతమనిగాని, యశాశ్వతమని గాని, గౌతమబుద్ధుఁడెచటను స్పష్టముగఁ దెలుపఁడు. ఆ విషయమున నెవరయి నను బ్రశ్నించినచో మౌనము వహించియుండునుగాని బదులిడఁడు. అయితే పున ర్జన్మ కర్మబంధములున్నవని పలికినాఁడు. ఆత్మయొక్క శాశ్వతస్థితిని నమ్మనపుడు పునర్జన్మ సిద్ధాంతమెటు కలుగుననిన నీవిధముగఁ బలికినాఁడు.

శరీరము పడిపోయినవెంటనె మఱియొక కర్మశరీరము సూక్ష్మమైనుగఁ బుట్టును. అది పుట్టుటకుఁ గారణము తృష్ణ. బ్రదికినపుడు ప్రాణి తనకుఁ గావలయు నని యభిలషించు పట్టుదలయొక్క ఫలముతృష్ణ. బాహ్యవస్తు సంయోగమున జ్ఞానేంద్రియములకు నుద్వృత్తికలుగును. ఆ యింద్రియోత్సేకమువలన దానిఫల మను భవింపవలెనను కోరికగలుగును. ఈ కోరికయే తృష్ణ. మానసోద్భవమగు నీ కామము మఱియొక సూక్ష్మశరీరమందును. ఇది కర్మమునుండి కలుగునట్టిది. ఈకర్మశరీరము తాను పూర్వమొనరించిన పుణ్యపాపముల వాసనలతోఁగూడి తనకు నర్హమగు శరీరమయి జనించును కావున నట్టి నూతనప్రాణికిఁ బూర్వజన్మ శారీర మానసగుణ వికారములే వచ్చుచుండును. ఈ దురవగాహమైన రహస్యమే బౌద్ధులసిద్ధాంతము.

బౌద్ధమతమురీతిగ దృశ్యప్రపంచ మశాశ్వతము. చరస్థిరవస్తువులెల్లను మార్పులయి నశించిచచ్చును. దేవతలు మానవులు చచ్చువారేను ఎద్దియును శాశ్వతముగ నిలువదు. ఇఁక జననక్రమ మెట్టిదనిన:—

అవిద్యనుండి సూక్ష్మాకృతి యేర్పడును. ఆ రూపమునుండి యహంకార మేర్పడును. అహంకారమునుండి నామరూపములేర్పడును. నామరూపములనుండి జ్ఞానేంద్రియ పంచకమున్ను మానసము నేర్పడును. వానినుండి జ్ఞానేంద్రియముల కున్ను వస్తువులకున్ను సంయోగము గలుగును. సంయోగమువలన నెఱుకగల్గును. ఆ యెఱుకనుండి తృష్ణ లేక, యాశగలుగును. ఆ తృష్ణమునఁ బ్రాణముపై నాశ గలుగును. ఆ యాశచే భావరూప ముద్భవించును. ఆ భావరూపమువలన జననము

కలుగును. జననమువలన ముదిమియు మరణము నిరాశయుఁ గలుగును. ఇదియ భూతకోటి కష్టానుభవ కారణము.

పై విషయమునుఁబట్టిచూడ మన జననమునకుఁ గారణ మవిద్యయని నట్లాయెను. అవిద్యయన నేమి? దీనికి గౌతముని శిష్యుఁడీరీతిఁ బలికెను.

కష్టమెఱుంగమి, కష్టమూల మెఱుంగమి, కష్టనాశన మెఱుంగమి, కష్టనాశన మార్గమెఱుంగమి. ఈ యెఱుంగమియే యవిద్యయనఁబడును.

గౌతముఁడే యొక్కచోట నీవిధముగ వచించెను.

అవిద్యయనఁగా కర్మమేను. ఒక జన్మములో మన మొనరించిన కర్మఫలములు రెండవజన్మమునకుఁ గారణములు. అవిద్యా నాశనమగునంతవఱకుఁ బునర్జన్మములు మనకుఁదప్పవు. ఆశాపాశములు సంపూర్ణముగఁ దెంచునంతవఱకు నవిద్య నశింపదు. దానినాశనముచే సూత్మాకృతుల తత్వములు నశించును. అవి నశించుటచే నహంకారము నశించును. తన్నాశనముచే నామరూపములు నశించును. దానివలన మానస వికారములు నశించును. దానిచే విషయసంయోగము నిలుచును. తత్కారణంబున విషయజ్ఞానము నశించును. ఆ నాశనముచేఁ దృష్ణ నశించును తన్నాశనమున దేహాభిమానము పోవును. తత్కారణంబున జననము లేకపోవును. జననము లేనపుడు ముదిమియుఁ జావులు నుండవు. దుఃఖముండదు. బాధలుండవు. చింతలుండవు. నిరాశలుండవు. ఇవియే మానవబాధలును నశింపఁజేయు విధములు.

గౌతముఁడు తన సిద్ధాంతమును కర్మ పునర్జన్మములను రెండు స్తంభములపై నిలిపినట్లాయెను. ఈ సిద్ధాంతములు గొన్ని మార్పులతో బ్రాహ్మణముల సిద్ధాంతములనుండియే గ్రహించెననుటకు సందియము లేదు.

తానువిత్తినఫలము తాననుభవించునను రీతిగ దనకర్మఫలమే తనసొత్తనియు తనబాధ్యతయనియు తన జననమూలమనియు నీసిద్ధాంతము చక్కఁగఁ దెలియఁబఱచుచున్నది. ఏలోకముననున్నను మానవుఁడు కర్మ మొనర్పకయుండఁడని తెలియఁజేయుచున్నది. దేహము నశించినను మానససంకల్పములు నశించినను కర్మ వాసనలు రూపముగొని యుండునని గౌతములు నిర్ధరించినారు. "ఎద్దియును లేదు అంతయునగును" అను సూత్రమే వీరికిఁ బ్రాధాన్యము. నీవు దేహ మానసికములచేఁ జూచునదంతయును దలఁచునదంతయును మాయమైపోవును. అయిన నీవొనరించు కర్మములయొక్కయు తలఁచు తలంపులయొక్కయు, మాటలాడు మాట

యొక్కయు ఫలములుమాత్రము సార్వకాలము నిలిచియుండును.

అవిద్యకుఁ జిక్కిన మానసస్థితి పదివిధములైన భ్రమలకు లోఁబడును. అవి యెవ్వియన:—

(1) శారీరభ్రమ, (2) సందేహభ్రమ, (విచికిత్స) (3) కర్మములకు వశుఁడగుట (4) కామవశుఁడగుట (5) క్రోధావేశుఁడగుట (6) భౌమికసౌఖ్యాపేక్ష (7) స్వర్గసౌఖ్యాపేక్ష (8) గర్వము (9) ఉద్ధత (10) అజ్ఞానము. ఈ పదిదుర్గుణములను మానవలెను.

ఇఁక వీనిని మాన్ప ననుసరింపఁదగిన మార్గము లెవ్వియన:—

(1) మంచియుద్దేశము (2) మంచిభావన (3) మంచిమాటలు (4) మంచినడవడిక (5) మంచి జీవనోపాయము (6) మంచిప్రయత్నము (7) మంచిమనస్సు (8) మంచిధ్యానము శాంతి (9) మంచివారితోఁ గూడి యుండడము (10) ధర్మవిధుల ననుసరించడము (11) పుణ్యార్జనాభ్యాసము. ఈ రీతిగనుండు వాఁడర్హతుఁడనియును నట్టివాఁడుమాత్రమునిర్వాణపదవి నందుననియు గౌతముఁడు స్థాపించెను. నిర్వాణమననేమి? దీపమాఱిపోయినటుల నాఱిపోవడ మాయేమి? ఆఱిపోవడమెద్ది? ఆత్మలేదనునపు డాఱిపోవున దాత్మకాదుగదా? పాపరూపముగ మానస హృదయములనంటి యాఁకలు గల్పించునట్టియు తత్కారణంబునఁ గర్మము లొనరింపఁజేసి పునర్జననమునకుఁ గారణమైనట్టియు స్థితి యెద్ది గలదో యాస్థితినాశనమే నిర్వాణమనఁబడునని గౌతముని సిద్ధాంతము. దీనినిఁ బట్టిచూడ, నిర్వాణమన నిష్కళంకమగు శాంతస్వభావమని సారమేర్పడును. సంపూర్ణజ్ఞానమును సంపూర్ణశాంతియు సంపూర్ణ సుహృదయమును గలవాఁడే నిర్వాణపదవి నందినవాఁడని తెలియనగును. ఈస్థితి నందుటకు నెంతటి పావన మగు నైతికస్థితి మానవుఁ డవలంబింపవలెనో చదువరు లూహింపనగును. తృష్ణ క్లేశోపాదాన స్థితుల నశింపఁజేసినవానికిఁ బునర్జన్మమునకుఁ గారణమేయుండదు గదా? అట్టివాఁడు దేహనాశనమువఱకు నుండిన జీవన్ముక్తుఁ డనియును దేహము వదలినపిదప విదేహముక్తుఁ డనియును హిందూ మతమున నామములున్నవి. దానినే నిర్వాణమను పదమున బౌద్ధులు వాడుచున్నారు. ముఖ్యమగు బ్రహ్మమునుమాత్రము నిరాకరించినారు.

ఇఁక గౌతమబుద్ధుని నైతిక ధర్మవిధులు మహాద్భుతములుగ నున్నవి. ప్రపంచజనులెల్ల రాధర్మములను తమతమ గ్రంథములలోఁ జేర్చికొన్నారుగాని

యా ధర్మము లెచటనుండి గ్రహించితిమను మూలస్థితిమాత్రము మఱచినారు.

గౌతమబుద్ధుఁడు నిర్వాణపదవి సాధించుటకు యమనియమాద్యష్టాంగ యోగములే సాధనములని స్థాపించినాఁడు. ఆత్మలేని హిందూ వేదాంతమతమే బౌద్ధమతమని చెప్పనగును. హాకిల్లుగారి జడాద్వైతమనినను ననఁదగును. ప్రతిమనుజుఁడు తనజ్ఞానాభివృద్ధిని తానేయార్జింపవలెనని బుద్ధుఁడు బోధించెను. ఈ మహానుభావుని యుపదేశమార్గ మట్టిపథమే యవలంబించియుండును. నిదర్శనముగ నీ క్రింద నొకకథను వ్రాసెద.

ఒకస్త్రీకి బహుదినములకు నొకపుత్రుఁడు గలిగెను. ఏకపుత్రుఁడను కారణంబునఁ దల్లి వాని నతిశయప్రీతిచే రక్షించుచుండెను. విధివశమున నాబిడ్డఁడు మృత్యువువాతఁ బడెను. తల్లి పట్టఁజాలని దుఃఖముచే నా శిశువునెత్తికొని బుద్ధుని శిష్యునివద్దకుఁ గొనిపోయి మహాత్మా! ఈ బిడ్డఁడు బ్రదుకునట్టి మందిమ్మని యడిగెను. ఆ మహాత్ముఁడు జాలినంది అమ్మా! చచ్చినవానిని బ్రదికించుమందు నావద్ద లేదు. అట్టి మందిచ్చువానినిమాత్రము నాకుఁదెలియునని చెప్పెను. అతఁడెవఁడని యాముగ్ధ బతిమాలి ప్రార్థింప నా మహాత్ముఁడు గౌతమబుద్ధుని నామము నుడివెను. అపుడా నారీమణి శవమును నెత్తికొని బుద్ధుని సరసకుఁజని తనపుత్రుని బ్రదికింపుమని వేఁడికొనెను. బుద్ధుఁడా స్త్రీ ముగ్ధత్వముఁజూచి యామెదుఃఖమును బోకార్ప నొకయుపాయంబుదోఁచి యామెకిట్లులనియెను. "ఈ గ్రామమున నెవరింటనైన నొక యావగింజనడిగి తీసికొనిరమ్మా. అయిన నట్టివారియింటిలో నెవరు నెపుడును జచ్చియుండఁగూడదుసుమా యని యానతిచ్చెను. ఆ ముగ్ధస్త్రీ మృతబాలకునెత్తికొని యింటికినిఁబోయి తనదుఃఖోదంతంబుఁ జెప్పికొని యావగింజ యాచించెను. ప్రతిగృహములో నెందఱో పుట్టిచచ్చినారని చెప్పుచువచ్చిరి. ఆ ముగ్ధ స్త్రీ యా మాటలెల్ల వినినతోడనె తెలివివచ్చి పుట్టినవారందఱును జచ్చుట సహజమేయని యూఱడిల్లి బాలుని శవసంస్కారమొనర్చి బౌద్ధయోగినియయ్యెను. ఇట్టి యనుభవోపదేశము బుద్ధుఁడు చేయుచుండెను.

బౌద్ధమతము స్వాతంత్ర్యమును సమత్వమును భ్రాతృభావమును బోధించు నైతికమతమనుటకు సందేహములేదు. ఈ మతమున జాతిభేదములేదు. శ్రౌతస్మార్తకర్మలులేవు. ఈ మతమున నాత్మలేదనువాద మెటులయినబోనిండు, అజ్ఞానమునుండి జ్ఞానోదయమెటులగును. అజ్ఞానస్వరూపమున జనించిన మనుజుఁడు శుద్ధబుద్ధముక్తభావ మెటులందుననుటకు హేతువులు చూపఁబడలేదు. మట్టిముద్ద

నెంతగఁగడిగినను నెంతగఁ గాల్చినను వహ్ని హెచ్చునుగాని మంటిస్వభావము పోవునా? తనమతమున నాత్మను దెచ్చియుంచినచో నావిషయము జనసామాన్యమునకు బోధించుట కష్టతమమగునని యగునేనియు జనులకది దురవగాహ విషయమగునని యు తలంచి బుద్ధుని యావిషయంబున మౌనమూని ప్రకారాంతరముగ నాత్మవిషయమునే బోధించినాఁడని నాకుఁదోఁచెడు.

బుద్ధుని జీవితకాలమున స్తుతులుగాని ప్రార్థనలుగాని పూజలుగాని, యాగహోమాది కర్మాచరణములుగాని యుత్సవములుగాని యెవ్వియునుండలేదు. బుద్ధునకు వీనియందే విశ్వాసముండలేదు. తన్నుఁదాను శుద్ధిపఱచికొని తనంతనుఁ దానే యభివృద్ధి నందవలెనుగాని బాహ్యకర్మములనుండి యేమియుఁ బ్రయోజనము లేదని యతనిసిద్ధాంతము. అతఁడుసిద్ధినందినపిదప నతఁడేమఱ్ఱిచెట్టుక్రింద వసించి యుండెనో యాచెట్టు పూజ్యమై పుణ్యక్షేత్రమాయెను. వెయ్యాఱుజనులు దిగ్దేశములనుండి గయకువచ్చి యావృక్షమును బత్రపుష్పఫలాదులచేఁ బూజించుచుండిరి. తత్కారణంబున గయపుణ్యక్షేత్రమయి గొప్పపట్టణమాయెను. ఆ బుద్ధుని యెముకలు దంతములు పడిచోట్లఁ బూడ్వఁబడి బృందావనములు గట్టఁబడెను. వానిపేరు దాగోబాలు. ఈ దాగోబాలున్నస్థళములుగూడ పుణ్యక్షేత్రములయ్యెను. కొన్నిదినములలోనే బుద్ధుఁడు దైవమని తలంపఁబడెను. అతనివిగ్రహములు దైవములై పూజింపఁబడసాగెను. ఆ విగ్రహములకు నాలయములు గట్టఁబడెను. తనమతములో నేదైవములేదనిన వానిచే వానిశిష్యులు దైవముగనొనర్చి పూజింపసాగిరి. ఇంతయకాదు. అతని శిష్యులుసైతము దైవములైరి. ఊహాలపైన దైవములనుగల్పించి పూజింపసాగిరి. వానికినై దేవాలయములుగట్టించిరి. ఈవిధముగ బౌద్ధమతము విగ్రహారాధనమతమయ్యెను. ఆగమాచరణము లోకరీతిగ మఱలఁ దలయెత్తెను.

బుద్ధునియనంతరము బ్రాహ్మణులనేకులు బౌద్ధమతములోఁజేరి యామతభాషయగు పాలీనివదలి సంస్కృతమయమునుజేసిరి. కావున నుత్తరదేశమునందలి బౌద్ధగ్రంథములు సంస్కృతభాషలో వ్రాయుటకుఁ గారణమాయెను. ఈ బౌద్ధులమతము చార్వాకుల మతమువంటిదికాదు. కొన్ని మార్పులతోఁగూడిన వేదాంతమతమేను. ఈ బౌద్ధమతమునుండి బ్రాహ్మణ మతములో మార్పులనేకములుగలిగెను. వేదాంతమతము పురాణమతమయ్యెను. పురాణమతమునకు మూలము, చెడిన బౌద్ధమతమేను.

బుద్ధుఁడు సిద్ధిపొందిన రెండువందల సంవత్సరములలోనే యామతముఁ

జెడి విగ్రహారాధనలు బలము బాగోబాలు: వృక్షములపూజలు హెచ్చు పెరిగి యుండెను. దీనికిఁ జేరికగ బ్రాహ్మణములకాలమునుండియు నథర్వణవేద జనితమగు శాక్తేయమతమొకటి వృద్ధినంది పురాణ యుగకాలమునకు మిగతమతములవలెనే చెడుదారులు ద్రొక్కియుండెను. ఆ శాక్తేయ మతవృద్ధియేణాత లించుకబ్రాసెద.

హిందూమతములో బహుకాలమునుండి యతిశయముగ వృద్ధినంది యుండిన మతము శాక్తేయమతమేను. ప్రపంచమునంతయును దనగర్భమునను ంచికొని చరాచరకోటిని జనింపఁజేసి వానిరక్షణార్థ మన్నములఁగు వస్తువులిచ్చి మనుచు చుండు తల్లి "భూశక్తి" గదా? అట్టి ప్రేమాస్పదురాలును, మనోహరురాలును నగు మాత భూమాతయేయని యెన్నఁబడియుండెను. ఆ మాతయే ప్రాణమనియు నాత్మయనియు సర్వశక్తియనియు నాద్యంతములనియు పూజింపఁబడ సాగెను. ఆ శక్తికే భవాని పార్వతి కాళియని యనేకనామము లిడఁబడెను. ఈ మతమున శ్రద్ధాభక్తులే ప్రాధాన్యములు "శక్తి" యననేమి? అది యెప్పుడెచటనుండి పుట్టెను? అని ప్రశ్నింప నది ఋగ్వేదకాలమందే పుట్టినదని పలికిరి. అది యెటులనిన నీరీతిగ సమాధానమిచ్చిరి.

ఋగ్వేద దశమమండలములోని 129.వ సూక్తమున్నది. ఆ సూక్తము లోని 1-2 ఋక్కులలో సృష్టికిమున్ను నొక్కటియే యుండెననియు నా యొక్క తత్త్వములోనుండి "యిచ్ఛాశక్తి" పుట్టెననియు నా యిచ్ఛాశక్తియే వ్యక్త స్వరూపములగు ప్రపంచాది వస్తుతత్త్వములకుఁ గారణమనియు తెలుపఁబడినది కదా? ఈ యిచ్ఛాశక్తి "కామస్తగ్రా" మొదటఁబుట్టెనని ఋగ్వేదములో పలుకఁబడినది. అనఁగా ప్రారంభమున బ్రహ్మమొక్కటి యుండెననియు యది యవ్యక్తముగ నుండినందున నెవరు నేరూపముగ నేవిధముగను నూహింపలేక యుండిరనియు పిదప నా బ్రహ్మమునందు గామమను శక్తి యుద్భవించెననియు ఋక్కులలోఁ బలుకుచు నేదైవమును నిపుడారాధింపవలెనని యడిగినాడు కావున "శక్తి"ని యనియే యుత్తరమియ్యఁదగినదిగ నున్నదని యెన్ని యనేకులా శక్తి "భూమాత" యనినమ్మి యనేకనామముల నా దేవతను బూజింపసాగిరి. బ్రహ్మ మవ్యక్తము. అయిన వానియిచ్ఛ లేక శక్తి లేక ప్రకృతి యగపడినపుడు బ్రహ్మము తెలియనాయెను. ప్రపంచమపు డగపడెను. ప్రకృతితోఁగూడిన పురుషుఁడగపడెను. జనులపుడు బ్రహ్మములోనుండిన శక్తి దేవతనుజూచి పూజింపసాగిరి. ఋగ్యజు స్సామవేదములందుండు ఋక్కులు యజ్ఞయాగాది కర్మములం దుపయుక్తములుగ

నుండినందున వ్యాసులవారు విభజించిరనియు మిగతబుక్కులు సుఖసంపాదనకున్ను ద్రవ్యార్జనకున్ను శత్రుసంహారమునకున్ను వశసిద్ధులకున్ను నుపయుక్తములుగ నుండినందున నవియైహికములని వ్యాసులు గూర్చనందున యథర్వణఋషి వానినెల్ల గూర్చినందున యథర్వవేద మేర్పడెననియు యా వేదమునకుఁ జేరినదే యీ శాక్తేయ సిద్ధాంతమనియు పలికిరి. అనఁగా ఋగ్యజుస్సామము లైహిక పారమార్థికములు రెంటికి నుపయుక్తములైనవనియు యథర్వవేద మైహికప్రయోజనము మాత్రము కలదియనియు నేర్పడెను. వశ్యవిద్యలకున్ను నైంద్రజాలములకున్ను మారణవిద్యలకున్ను రసవాదములకున్ను వైద్యచికిత్సలకున్ను నథర్వవేదము మాతృస్థానమయ్యెను. ఆగమకర్మములెటు మోక్షసాధనములో యారీతిగనే యీ యథర్వవేద తంత్రము లణిమాది శక్తులిచ్చునవని యేర్పడెను. త్రయీవిద్యలకు యోగాభ్యాస మేర్పడెను. అథర్వవిద్యకు తాంత్రికసాధన లేర్పడెను. బుద్ధుని యనంతరము నందీ తాంత్రిక సాధనాభ్యాస మామతములో బలముగఁజొచ్చెను. తాంత్రికసాధనలలో శక్తి ముఖ్యదేవతయాయెను. వేదాగమాచరణల వలెనే తాంత్రికసాధనలందును మద్యమాంస సేవన బలమాయెను. పశుహింసలు హెచ్చాయెను. ఈ శాక్తేయమతమునకు శక్తి ఋగ్వేదమునుండి వచ్చెను. తాంత్రికసాధనము లథర్వవేదమునుండి వచ్చెను. పశుహింస బ్రాహ్మణములనుండి వచ్చెను. సిద్ధాంతము వేదాంతమునుండి వచ్చెను. ఈ తాంత్రికవిద్య యధ్యాత్మజ్ఞానమునకు మంచివారికి సాధనమాయెను. దుర్మార్గుల పాపకృత్యములకు మార్గముఁజూపెను.

తాంత్రికసాధనములు యోగసాధనములకంటెను హెచ్చుగ నేర్పడెను. నిదర్శనముగ నొక్కవిషయ మిచటవ్రాసెద.

" మనదేహమున నారీచక్ర మొకటి యున్నది. నాభీప్రదేశము లోభాగమున నొకకోశము గొట్టమువలె నున్నది. అచటనుండి పైరువలె ననేకములగు నరములు మొలకలెత్తుచున్నవి. 22000 వేల నరములని పెద్దలు లెక్కిడినారు. అవి యన్నియును నూర్ధ్వముఖములై యుండును. చక్రమువలె గుండ్రముగనుండును. అసంఖ్యాకములగు పై నరములలోఁ బదిమాత్రము ముఖ్యములైనవి. (1) ఇడా (2) పింగళ (3) సుషుమ్న (4) గాంధారి (5) హస్తిగిహ్వ (6) పృథ (7) జోష (8) అలంబస (9) హూహూ (10) శంఖినిః--ఇవి ముఖ్యప్రాణములని వర్ణింపఁబడినవి. ఈ పది ముఖ్యప్రాణములున్ను మఱలఁ బదివిధములుగ విభజింపఁబడినవి. (1) ప్రాణ (2) అపాన (3) సమాన (4) ఉదాన (5) వ్యాన (6) నాగ (7) కూర్మ (8) కృకర (9) దేవదత్త (10) ధనంజయ.

వీనిలోఁ బ్రాణమనునది ముఖ్యమైనది. ఇదియే సర్వప్రాణములకు సాధారముగ నుండునది. దీనికి శ్వాసోచ్ఛ్వాసములు గలిగించు శక్తిగలదు. మలమును వెలివేయునది యపానప్రాణము. వాతపిత్త శ్లేష్మములను సమస్థితి నుంచునది సమానప్రాణము. దేహమునకు ననేకములగు చలనములు గలిగించునది యుదాన ప్రాణము దేహోత్పత్తికిని దేహవ్యాధికినిఁ గారణము. వ్యానము. ఆవలింతలు గలిగించునది నాగము. నోరు తెఱపించునది కూర్మము. అన్నము తినినిచ్చునది కృకరము. దేహవస్తుతత్త్వములోఁ జేరినది ధనంజయము. త్రేపుట దేవదత్తమునుండి కలుగును. మరణమందినను ధనంజయవాయువు నిలిచియుండును. ఇవి మఱలఁ బది విధములుగ విభజింపఁబడినవి.

(1) ఉన. ఎక్కిళ్లు గలిగించునవి (2) అధిమాస. ఆవలింతలు గలిగించునవి (3) రీన. దగ్గుపుట్టించునది (4) ధన. ఊపిరిపుట్టించునది. [నడుము విసుభము] (5) కుడిభాగము. ఉత్తరము. (6) ఎడమభాగము, దక్షిణము. శరీరమధ్యభాగము సుషుమ్న (7) ఎడమ ఇడ (8) కుడి. పింగళ. దానిపైభాగము ప్రాణము. అది. (9) దినము (10) రాత్రి అపానము. ప్రాణవాయువు లీరీతి పదిభాగములొనర్చిరి. ఈ పదివాయువులను వశపఱచుకొను సాధనము ప్రాణాయామ నియమము. దీనినుండి యూపిరి దేహములోనికిఁ బీల్చుట పూరకము. ఊపిరి బిగపట్టుట కుంభకము. ఈ వాయువులన్నియు నూర్ధ్వముఖములుగఁ జేసినచో శివదర్శనమగునని శాక్తేయుల సిద్ధాంతము. తాంత్రిక సాధనములు యోగసాధనములేను. మంత్రములథర్వవేదములోనివి. వీనిని సాధించినవానికి స్తంభన, మోహన, వశీకరణ, విద్వేషణ, ఉచ్చాటన, మారణ, శాంతి మహిమలువచ్చునని తెలుపఁబడినది. ఇవి యెట్లులొనరింపఁదగినవి వివరింపఁబడినవి. శాక్తేయమతములో నాగమ కర్మములున్నవి. గాని నిగమాచరణములు విశేషముగలేవు. ఈ మతమువా రాత్మను నమ్మెదురు. యోగమును సాధింతురు. అయిన నన్నిసాధనలును ప్రాపంచిక సుఖమునకునై చేయుచుందురు. సరియయిన మార్గములో నుండువఱకు నీమత మొక్కవిధముగ మంచిదిగానేయుండెను. ఎపుడు పంచతత్త్వసాధనమీ మతములోఁ బ్రవేశించెనో యప్పటినుండియు మతముచెడెను. క్రూరకృత్యములు బలమాయెను. నీతిబాహ్యమయ్యెను. వావివరుసలు లేకపోయెను. మద్యమాంస సేవనలు హెచ్చాయెను. ఈ మతమునకు నత్యంతమగు కళంకముగలిగెను. నీతిపథమునే మతాధారముగ నుంచికొనిన బౌద్ధులు కొందఱీ మతము నవలంబించిరి.

ఇట్టికాలంబున హిందూ పురాణమతము ప్రారంభమాయెను. అదియు నేకముఖముగాక యొకటికి మఱియొకటి విరుద్ధమయి జనులను సందేహ సముద్రములో ముంచెను. కొందఱు కన్న దైవములను బూజింపసాగిరి. కొందఱు తమ దైవమే హెచ్చని కలహింపసాగిరి. మఱికొందఱు దైవమే లేదనిరి. బౌద్ధులనుఁ జూచి బుద్ధునకుఁ బ్రత్యామ్నాయముగ రామ కృష్ణావ తారములను గల్పించిరి. బుద్ధునివృక్షమునకు మాఱుగ మఱ్ఱిచెట్టును తులసీవృక్షములను బూజింపసాగిరి. బౌద్ధుల డాగోబాలకుమాఱుగ దేవాలయములు నిర్మించిరి. ఇవి పురాణమునుండి కలిగినది. శ్రీ శంకరాచార్యుల కాలమునాటికి భరతఖండములో నుండిన ముఖ్య మతము లీక్రింద వ్రాయఁబడినవి. వానినెల్ల సంపూర్ణముగనో కొన్నిభాగములో ఖండించు కష్టతమమగుపని వారిపైఁబడెను.

[1] పురాతన వేదమతము [2] అథర్వరహస్యమతము [3] బ్రాహ్మణములమతము [4] ఉపనిషన్మతము [5] సాంఖ్యమతము [6] వేదాంతమతము [7] యోగమతము [8] జైనమతము [9] బౌద్ధమతము [10] నాస్తికమతము [11] తాంత్రికమతము [12] పురాణమతము. మఱియుఁ జిల్లరమతము లనేకములు.

ఇన్నిమతములను బొత్తిగ ఖండింపకయున్నను సంస్కరించి యేమతమునకును విశేషముగ విరుద్ధముగానటుల మత మేకముఖమగులా గొనర్చినవారు శ్రీ శంకరాచార్యులవారేను. మహనీయులగు శ్రీ శంకరాచార్యులవారి కాలనిర్ణయమునుగుఱించి నేను ప్రత్యేకముగ వ్రాయఁబూనితిని గావున నిచ్చట వ్రాయలేదు, వారి చరిత్రసైతము వారిమతమును వివరించునపుడు వ్రాయఁబూనెద. వీరు మతములనెల్ల నొక్కరూపము దాల్చునటుల సిద్ధాంత మొనర్చినవారు కావున వీరి సిద్ధాంతములందెచటనో యించుక లోపముండినను నదియొక గొప్పతప్పని వారిని నిందింపరాదు. వారి సిద్ధాంతము భరతఖండములో సమస్త జనాదరణీయముగ నున్నది. ఇప్పటికిని వారిసిద్ధాంతమే యొక భరతఖండమేగాదు యూరోపు అమెరికాలలోసైతము వ్యాపించి సర్వులకు నధ్యాత్మజ్ఞాన మొసంగినది నాస్తిక వనకుఠారమైనది. ఇతరమత సిద్ధాంతములకు మార్గదర్శకమైనది. జనులలో నైకమత్యముగలిగించు మతమిది. ఈ మతము లోకసామాన్యము తెలిసికొను నంతటి సులభసాధ్యము కాదు. జనుల యవగాహన శక్తి ననుసరించి సిద్ధాంతము లొనర్చుట సాధ్యమా? శ్రీ శంకరాచార్యులవారు సన్న్యాసమునకే ప్రాధాన్యమునిచ్చి కర్మను నిరాకరించినారని కొందఱు తలఁచినారు. జనులందఱును సన్న్యాసులైనచో ప్రపంచ వ్యవహారమే నిలిచిపోవునని వాదించుచున్నారు, ఇది యెంతటితప్పో ప్రాజ్ఞ

లూహింతురుగాత. సన్న్యాసము స్వీకరించునంతటి యోగ్యత నార్జించువారు ప్రపంచంబున నెందఱుగలరు? అందఱును దైవవశమున సన్న్యాసులైరేని బ్రహ్మ సృష్టికింగ అవా? ఇంకఁ బుట్టుచునే శుకాదులబలె నందఱును సన్న్యాసులైనచోఁ గర్మయేల! ప్రపంచమేల? ఇంతకును సన్న్యాసత్వము బ్రాహ్మణులకేగదా విధింపఁ బడినది. ప్రపంచవ్యవహారములకు నితరజాతివారు లేరా? శ్రౌతస్మార్త కర్మములు వలదని, బౌద్ధులబలె, వీరేమయినఁ బలికిరియా? ఈ మహనీయుల సిద్ధాంత సూక్ష్మ మెఱుంగనవియే యీ తప్పభిప్రాయమునకుఁ గారణము. వీరల్పాయువులై సిద్ధినందక యింకను ముప్పది వత్సరంబులు బ్రదికియుండిరేని తమ సిద్ధాంత మెల్లరకు బోధపడు లాగు స్పష్టముగ వివరించుచుండిరి. అధ్యాత్మజ్ఞానమునుగుఱించి వ్యావహారిక భాషలో వారు వ్రాసినదానికంటెను హెచ్చుగ వ్రాయసాధ్యముకాదు. వారొన రించిన మాయావాదమువారు నూతనముగం దెచ్చియుంచిన వాదముకాదు. వేదము లోనేమి ఉపనిషత్తులలోనేమి బ్రహ్మసూత్రములలోనేమి వచించిన దానినేవిస్తరించి పలికిరి.

మాయావాదమునుగుఱించి కొంతవఱకు నిదివఱలోఁ దెలుపఁబడినది. నే నచ్చోట వ్రాసినరీతిగ సచ్చిదానందస్వరూపమున నుండునదియే పరబ్రహ్మము. రూపరహితము. మనకగపడు లోకములెవ్వియును లేనికాలమున అనఁగా సృష్టికి మున్ను పరబ్రహ్మము యొక్క ప్రభ ( Divine power ) యంతటను వ్యాపించి యుండెను. అట్టికాలమున మనకిప్పు డగపడునట్టి వస్తుతత్త్వములేగాని కాల దేశములేగాని యెవ్వియు నగపడుచుండలేదు. ఇపుడు మనకగపడు సర్వ తత్త్వముల సూక్ష్మతను బీజముల సముదాయము త్రిగుణాత్మకమై యవ్యక్తమై బ్రహ్మములో నడఁగియుండెను. అవి బ్రహ్మమునుండి భిన్నమనిగాని బ్రహ్మమేయని గాని యేర్పఱచుటకు మార్గముండలేదు. సర్వము నైక్యమై యవ్యక్తముగనుండెను. త్రిగుణాత్మక తత్త్వబీజాంతర్గతావ్యక్తమగు మూలతత్త్వమే మాయయని శబ్దప్రపంచ మేర్పడినపిదప నామమువచ్చెను. కాలదేశముల విభజనగాని భావనగాని లేనపుడు మాయ యెచ్చటనుండి వచ్చెననుటకు మార్గములేదుగదా. కావుననే మాయ యనాదియని పిలువఁబడును. పరబ్రహ్మము సర్వవ్యాపకముగాన దానికి చలన మెచటినుండివచ్చును? ఇంక మాయయన్నదో త్రిగుణాత్మకమైనది. ఆ సత్త్వరజస్తమో గుణములు సమానస్థితిలో నైక్యముగ నుండునపుడు మాయకును చలనము లేక యుండెను. ఆ గుణముల స్వభావలక్షణము చలనము. ఆ చలనము కలిగినపుడు మాయవ్యక్తమయ్యెను. ప్రారంభమున వ్యక్తమైనది సత్త్వగుణము. ఆ సత్త్వ

గుణాంతర్గతమగు బ్రహ్మమును శబళబ్రహ్మము లేక ఈశ్వరుఁడని మానవులు నామ మిడినారు. సృష్టికిఁ బ్రారంభదశయిది. మాయాగుణములకుఁ జలనశక్తి, లేక క్రియాశక్తి యెట్లుకలిగెనని యడుగనగును. అది వానిస్వభావమని చెప్పవలసినది తప్ప వేఱుమార్గముఁ గానఁబడదు. అట్లైన మాయాచ్ఛాదితములైన త్రిగుణములే నా సృష్టికిఁ గారణములని ప్రశ్నింపనగును. అటు చెప్పనగునుగాని పరబ్రహ్మ ప్రభ లేక త్రిగుణాత్మక మాయకు సృష్టిశక్తి రాదని పలుకఁబడును. చలనమువలన సామ్యావస్థలోనున్న త్రిగుణములకు భిన్నత గలిగెనుగాని పరబ్రహ్మమునందే భిన్నతయుఁ గలుగదు. "ఏకమేవాద్వితీయ" మను వాక్యమెపుడును సార్థకముగ నుండును. చలనమున గుణములు వేఱయినపుడు, గుణములు పరబ్రహ్మములోఁ గదలినను నటు కదలిన గుణములకు సర్వవ్యాపకమైన పరబ్రహ్మ స్వరూపమే యాధారమాయెను. వేఱగుటవలన వ్యక్తమైనది త్రిగుణాత్మక మాయగాని పరబ్రహ్మము కాదనుట స్పష్టము. ప్రథమవ్యక్తమగు మాయను, సాధ్యమయినచో, జ్ఞానాంజనమున వదల్చినచో నిలుచునది పరబ్రహ్మమేను. గనుక "ఏకమేవాద్వితీయ"మను నుడి సార్థకమేను. మఱలఁ జలనములో సత్వరజస్తమోగుణము లొక్కటొకటిగానో యన్నియును హెచ్చుతగ్గులుగాఁ గూడియో వ్యక్తమయ్యెను. అపుడును సర్వవ్యాపకమైన బ్రహ్మమే దానికి నాధారమాయెను ఆ, వ్యక్తస్వరూపమునకు "నాత్మ" లేక "జీవుఁ" డని పిదప నామముకలిగెను. పిదప సాంఖ్యులు పలికినరీతిగఁ బంచతన్మాత్రలును పంచజ్ఞానేంద్రియములును పంచకర్మేంద్రియములును, పంచమహాభూతములును, వానిగుణశక్తులును, మనస్సును నంతరింద్రియమును గలిగెను. అయిన వారుపలికినరీతిగ పురుషుఁడు లేక యీ సృష్టి కలిగెననుట వేదాంతులొప్పరు. సర్వతత్వములకు మూలస్థానము పరబ్రహ్మమనియే వారునిర్ధరించి "ఏకమేవా ద్వితీయ" మనిరి. ఇది సృష్టిక్రమము. ఇఁక వ్యక్తవస్తు గుణలయము నుండి వస్తులయమగునుగాని పరబ్రహ్మము శాశ్వతముగ నిలిచియుండును. అనఁగా భూతత్వము జలములోను జలతత్వ మగ్నిలోను నగ్నితత్వము వాయువులోను వాయుతత్వ మాకాశములోను నాకాశతత్వము మనములోను మనోతత్వ మాత్మలోను నాత్మ పరమాత్మలోను గలయునుగాని వీనిలోనుండు బ్రహ్మ మేకవిధముగనే చలనములేక శాశ్వతముగ నిలిచియేయుండును. వ్యక్తద్రవ్యములన్నియును రూపుమాదుచు నశించుచుండునుగాని బ్రహ్మమువలె సత్యముగ నుండునవి కావని దానికి వ్యతిరేక శబ్దము మిథ్యయని యుపయోగించినారు. మిథ్యయనఁగా శశవిషాణము వంధ్యాపుత్రుఁడనినరీతి, నభావపదార్థముగాదు, "బ్రహ్మంసత్యంజగన్మిథ్య",

యను వాక్యార్థ మిదియేను. లోకానుభవము శాస్త్రప్రావీణ్యము తపోశక్తిగల జ్ఞానులుప్రత్యక్షముగఁ దమకండ్లఁగాంచుటనుండు జగత్తును సర్వాబద్ధమనునంతటిపిచ్చి వారుకారు. ఇదియంతయును మాయాసృష్టిలోఁజేరినది కావునను "మాయ" యసత్యముకావునను, జగత్తుమిధ్యయని జ్ఞానులనిరి. "బ్రహ్మసృష్టి" యని పలుమారు శాస్త్రములలో వచ్చుచుండునుగదా. అదియేమియని యడుగనగును. మాయా సృష్టిలోనంతయును బ్రహ్మము నిండియుండును గావున బ్రహ్మములేనిదే జగత్తు పుట్టనందునను నేవస్తువును బ్రహ్మములేనిది యుండుటకు సాధ్యముకాదు కావునను సర్వముబ్రహ్మసృష్టియని పేరిడినారు. సృష్టికి బ్రహ్మము నిమిత్తకారణమాయెను. మాయ యుపాదానకారణ మాయెను. మాయా సృష్టియొక్క వేళలోనే యొక్క పెట్టున వచ్చినదికాదు. ప్రతినిమిషమునను నీమాయా సృష్టిలయకార్యములు జరుగుచుండును. అవి మానవదృగ్గోచరములుగావు. మాయలో నిపుడు మన కగపడువస్తువుల సూక్ష్మబీజములును వానిగుణములును సుఖదుఃఖాది వాసనలున్ను జ్ఞానాజ్ఞానాది లక్షణములును చేరియున్నవి. మంచివన్నియును సత్త్వమునకుచేరినవి. చెడుగులన్నియును రజస్తమోగుణములకుఁ జేరినవి. ఈ రజస్తమోగుణముల నడచి సత్త్వగుణాభివృద్ధిఁ జేయుక్రమము పతంజలియోగశాస్త్రమున విస్తరించి పలుకఁబడినది. సత్త్వగుణాభివృద్ధిచే నజ్ఞానము, లేక, యవిద్యనశించును. సూర్యకిరణమహిమచే నంధకార మెట్లులయమగునో యట్లులనే జ్ఞానవిశేషమున నజ్ఞానమునశించును. ఒకవేళ రజస్తమోగుణముల యభివృద్ధికతంబున నజ్ఞానము హెచ్చయినచో సత్వగుణముతగ్గి జ్ఞానమడఁగిపోవును. జ్ఞానము హెచ్చయినట్లెల్లను గ్రమక్రమముగ నున్నత లోకప్రాప్తియగును. ఉన్నతలోకము లెవ్వియన [1]భూలోకము [2] భువర్లోకము [3] స్వర్లోకము [4] మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. ఇవి యన్నియును, జ్ఞానముయొక్క క్రమక్రమోన్నత దశలు. తపోలోకమునకు జీవి సూక్ష్మరూపమునఁ బోవువఱకు గుణలేశముల వాసనలుండును. ఆ వాసనలు పోయినపిదప సర్వవాసనలు లయమయి బ్రహ్మమయినకతంబున బ్రహ్మములో లీనమగును. దీనికేలోకమందురు. లోకమనఁగా మనభూమివంటి భూమియనికాదు. అది తత్వములో జేరినసూక్ష్మము. ఇక సత్వమడఁగి రజస్తమోగుణములు ప్రబలించినపుడు జీవి "యతల, వితల, సుతల, తలాతల, మహాతల, పాతాళలోకములఁజేరును. ఈ లోకములలో నెచటనైనను సత్త్వమించుక తలయెత్తినచో నున్నతదశకు రానగును కావునఁ బడినవానికి ముక్తిలేదనునది యీ మతమొప్పదు.

సాంఖ్యులు పురుషుని జడునింజేసి చూచుచుండునటుల యొకచోటం జెప్పుండంబెట్టక ప్రధానములోంజేర్చి ప్రధాన సృష్టికంతయును పురుషసాన్నిధ్యమే ముఖ్యమనియు ప్రధానసృష్టి వస్తువులలో నెల్ల పురుషతత్త్వముండుననియు తెలిపి యుండినయెడల వారిదియు మాయావాదమే యగుచుండెను.

మాయావాదమునందు సృష్టికి పరబ్రహ్మము నిమిత్తకారణమనియు మాయ యుపాదానకారణమనియు మున్ను తెలుపంబడినది. అయిన బ్రహ్మమును వదలి మాయ యుండదు కావున బ్రహ్మ ముపాదానకారణమగునని సైతము చెప్పనగును. శారీరకసూత్రములోం బ్రహ్మ ముపాదాన నిమిత్తకారణములు రెండునగునని వచింపంబడినది.

పంచతన్మాత్రల పంచీకరణములవలన పృథివ్యప్తేజోవాయు రాకాశములును బదునాలుగు లోకములును, బ్రహ్మాండములోంగల జరాయుజాండజోద్భిజ్జ స్వేదజములు కలుగుననియు తెలుపంబడినది.

మాయావాద సారము "ఏకమేవాద్వితీయం" అను వాక్యమును స్థిరపఱచి "బ్రహ్మంసత్యం జగన్మిథ్యా జీవబ్రహ్మైవనాపరా" యను సిద్ధాంతమును సాధించునది. అనంగా బ్రహ్మ మొక్కటియే. దానికి భిన్నమయిన వస్తువెద్దియును లేదు. బ్రహ్మము సత్యము. జగత్తుమిథ్య. జీవాత్మ పరబ్రహ్మమేను వేఱుకాదు. పై వాక్యమున జీవుండు పరమాత్మయేగాని వేఱుకాదని తెలుపంబడినది. ఈ విషయ మించుక తెలుపవలసినదిగ నున్నది. బ్రహ్మమునందు "విజాతీయ స్వజాతీయ స్వగత భేదము లెవ్వియును లేవను వాద మొకటి బహుకాలమునుండి యుండినది. స్వజాతీయ విజాతీయభేదములు లేవుగాని స్వగతభేదమున్నదని యొకవాదముండినది."

(1) విజాతీయ భేదమనంగా బ్రహ్మమునకును బ్రకృతికిని, వస్తువుకును మనస్సునకును భేదము.

(2) స్వజాతీయభేదమనంగా - జీవాత్మ పరమాత్మలకు భేదము.

(3) స్వగతభేదమనంగా - బ్రహ్మములోనే భేదము. స్వచ్ఛముగ నేకరసముగ నేభేదమునుగానక పరబ్రహ్మతత్త్వమున్నదని యొకవాదము. ప్రకృతితోం జేరిన జీవాత్మ పరమాత్మయొక్క యొకవిధమగు స్థితియనియు పరమాత్మతో నేకమైనను నా రెంటికిభేదము కనబడుచుండుననియు నొక వాదము.

పైన వ్రాయఁబడిన మూఁడు తరగతులలోను భేదములేదు. పారమార్థిక దృష్టినిఁగనిన సర్వము నొక్కటేయనువారు విశుద్ధలేక నిర్విశేషాద్వైత వాదులైరి. మొదటి రెండుతరగతులలో నేకమైనను మూఁడవతరగతిలో నేకత్వమునకు నించుక న్యూనతఁగలదనువారు విశిష్టవాదులైరి. మొదటివారద్వైతులు రెండవవారు విశిష్టాద్వైతులైరి. ఈ రెండువాదములను బలపఱచుటకు బ్రహ్మసూత్రములేమి యుపనిషత్తులేమి ప్రమాణములుగనున్నవి. మొదటివాదము మాయావాదము. రెండవవాదము పరిణామవాదము. ఈ వాదములు రెండును ఋగ్వేదకాలమునుండియుండినను జనులావాదములంతగఁ బాటింపరైరి. శ్రీశంకరాచార్యులవారు మాయావాదము ననుసరించి భాష్యములు వ్రాసినందున వారికి మాయావాదులని నామమువచ్చెను. శ్రీ రామానుజాచార్యులవారు బోధాయనుల భాష్యమునుఁబట్టి పరిణామవాదమును స్థాపించు భాష్యమొనర్చిరి కావున వారికిఁ బరిణామవాదులని నామమువచ్చెను. ఈ వాదముల ఫలములే నిర్గుణ సగుణవాదములు. నిర్గుణ సగుణవాదములే మతభేదమునకుఁ గారణములు. ఆత్మ లేక యాత్మలు పరమాత్మలోకముఁ జేరువఱకు వాదములో ద్వైతాద్వైత విశిష్టాద్వైతములంతటి ముఖ్యభేదము లగపడవు. అటఁజేరినపిదపఁ బరమాత్మలో లీనమా సంయోగమా భిన్నమా యను వాదములుపెఱిగి ద్వేషములు హెచ్చెనుగాని యే యాచార్యపురుషులుగాని యీ వాదములను సముచ్చయింపరైరి. ఈ ద్వేషములు రాజస తామస గుణఫలములుగాని వేఱొకటిగాదు. భగవద్గీతలో మాయా పరిణామవాదములను సముచ్చయింప యత్నింపఁబడినదిగాని యది హేతువాదములనుబట్టి పరీక్షించు నిప్పటివారికిఁ దృప్తికరముగ నుండదు.

మాయాంతర్గత త్రిగుణముల మహిమ వేఱొకభాగమున వ్రాయఁబడినది. అద్వైత విశిష్టాద్వైత విషయములు మతశీర్షికక్రింద వ్రాయఁబడును.

మాయావాదము బౌద్ధసిద్ధాంతములోసైత మున్నది. శ్రీ శంకరాచార్యులవారు మాయావాదము ననుసరించి పరబ్రహ్మమును దెచ్చియుంచినారని శంకరాచార్యులను ప్రచ్ఛన్నబౌద్ధులనియు యీశ్వరుని నిరాకరించిన సాంఖ్యమతములో నీశ్వరునిఁజేర్చి మాయావాదమును జేసినారు కావున ప్రచ్ఛన్న సాంఖ్యులనియు పలికెదరు. సాంఖ్యమతమును విశేషభాగ మవలంబింపని సిద్ధాంత మెచటనులేదు. కావున నందఱును ప్రచ్ఛన్నసాంఖ్యులేను. దేహతత్త్వములన్నియును సాంఖ్యాచార్యులనుండి యేర్పఱపఁబడినవేను, వారు ప్రమాణములులేని కారణంబున బహు

జనులు విశ్వసించుచుండిన యీశ్వరుని స్థాపించి సిద్ధాంతముం జేయనైరి. నిరీశ్వర వాదమును సిద్ధాంతీకరించిరి. పతంజలి యీశ్వరునిఁదెచ్చి యోగశాస్త్రమును సాంఖ్యులరీతిగనే కల్పించెను. శ్రీ శంకరాచార్యులవారు సైతము "ఆత్మను పరమాత్మను దెచ్చిపెట్టి" యించుక భేదముతో సాంఖ్యశాస్త్రమునే కల్పించిరి. వీరి వాదములలోని యీశ్వరుఁడు సమష్టిని నిర్గుణుఁడైనందున నట్టి దైవముండిననేమి యుండకున్ననేమి జనులకు బోధపడనందునఁ దృప్తికరముగ లేదని శ్రీ రామానుజాచార్యులవారీశ్వరుని సగుణునిఁజేసి కొన్ని విశేషణము లీశ్వరునియందారోపించి సిద్ధాంతము సులభపఱచిరిగాని యాత్మ లీశ్వరుని స్వరూపమైనను నీశ్వరుని నంటియుండువారనిరి. ఈ సిద్ధాంతమును జనసామాన్యమునకుఁ దెలియదాయెను. పిదప శ్రీ మధ్వాచార్యులవారు జనసామాన్యమునకెల్లఁ దెలియులాగున ఆత్మలు వేఱు. ఈశ్వరుఁడు వేఱనియు ఆత్మ లీశ్వరుని సామీప్యముఁజేరి యతనినిఁజూచుచు నానందించుచుండు వారనియు సిద్ధాంతమొనర్చిరి. ఈ వాదసిద్ధాంతము లీయాచార్య పురుషులనుండియే యుత్పన్నములైనవి కావు. వేదములందేమి యుపనిషత్తులందేమి బ్రహ్మసూత్రములందేమి యీవాదముల విషయ మచ్చటచ్చట సూచింపఁబడినవి. ఆచార్యపురుషులు జనించుటకు బహుకాలమునకుమున్నే యీ వాదములుండినవి. జనసామాన్యమట్టి యవ్యక్తరూపమును గనుంగొనుటకు సాధ్యపడక నిరాశులై నాస్తికులైనందున నట్టివారిని మార్గమునకుఁ దెచ్చుటకై యవతారపురుషులను గల్పించి పరమాత్మయే యీ యవతారమెత్తెనని జనులకు దైవముపై బుద్ధిఁగలుగఁజేసి భక్తికుదిర్చిరి. దానినుండి జనులకు జ్ఞానోదయమై యొకరొక్కరు పైనఁ బలుకఁబడిన సిద్ధాంతముల ననుసరింపసాగిరి. కావున నాస్తికులమతము సన్నగిల్లెను. లోకసంస్కారణార్థమిది శ్రేయస్కర మార్గమనుటకు సందియములేదు.

ఇంక శ్రీశంకరాచార్యులను ప్రచ్ఛన్నబౌద్ధులనిరి. కారణము మాయావాదమేను. బౌద్ధులకు మాయావాద మెచ్చటినుండివచ్చెను? భగవద్గీతలో వాదము లేదా? (7). 25. "యోగమాయాసమావృతః" (4) 6 "సంభవామ్యాత్మమాయయా" (7). 14. 15. "మమమాయాదురత్యయా" "మాయమేతాంతరన్తితే." "మాయయాపహృతజ్ఞానా" (18) 61 "యంత్రారూఢాని మాయయా" యని పలుకఁబడినది. భగవంతు నవ్యక్తశక్తి మాయయని తెలుపఁబడినది. భారత శాంతిపర్వములో భగవంతుఁడు నారదునకు విశ్వరూపము నగపఱచినపిదప "మాయాహ్యేషామయా సృష్టాయన్మాంపశ్యంతినారద" యని పలుకఁబడినది. శ్వేతాశ్వతరోప నిషత్తులో [4-10] "మాయాంతుప్రకృతిం విద్యా

న్నాయినంతు మహేశ్వరం" అని పలుకఁబడినది. ఋగ్వేద (6-మం 47-16) లో "ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే" యనియున్నది. ఇటుల మాయ రూపాత్మక స్వరూపప్రపంచమునను మాయ, ప్రకృతి, యజ్ఞానము, అవిద్య, మిథ్యయని పూర్వకాలములోనే శ్రుతిస్మృతు లనేకములుండినవి. "ఏకంసద్విప్రా బహుధావదంతి" యను ఋగ్వేదవచనమురీతి నొకమాయకు ననేకనామము లుప యుక్తములైనవి. ఈ శబ్దములేగాని యీ వాదముగాని శ్రీ శంకరాచార్యులవారు తాము నవీనముగ గల్పించినవారుగారు.

సృష్టికాలమున పరబ్రహ్మము యొక్క ప్రభ సర్వమును నిండికొని యుండెను. ఆ, సత్యమగు పరబ్రహ్మముతప్ప మఱియేమియు నుండలేదు. అట్టి పర బ్రహ్మమునం దసత్యములగు సృష్టి బీజములనుంచికొని మాయ యెటులుండెను? అటు మాయ యున్నదనినచో పరబ్రహ్మము మాయయను రెండువస్తువులాయెఁ గదా? అది యొప్పినచో "ఏకమేవాద్వితీయ" మను శ్రుతివచనమునకు భంగము గలిగి ద్వైతముపుట్టదా? అను నాక్షేపణము సహజముగఁ గలుగును.

ఋగ్వేదములోఁ బదియవమండలము 129 సూక్తము 2-వ ఋక్కీరీతిగ నున్నది.

"నమృత్యురాసీదమృతంనతర్హి నరాత్ర్యాఅహ్నఆసీత్ప్రకేతః।
ఆనీదవాతం స్వధయాతదేకం తస్మాద్ధాన్యన్నపరః కించనాస"

యని యున్నది.

వ్యక్తములగు పదార్థము లెవ్వియును లేనికాలమున "ఒక గొప్పవస్తు వుండెను. దానికి పరబ్రహ్మమని జ్ఞానులనిరి. ఆ వస్తువునుండి కామము వెడలెను. దానినుండి యనేకవస్తువులు వెడలెనని యీ సూక్తములోఁ బలుకఁబడినది. ఆ సూక్తము యొక్క భాషాంతరీకరణము సృష్టిప్రకరణములో నేను వ్రాసినాను. మిగతది యెట్లులైన నుండినను మూలారంభమునఁ బ్రహ్మమను వస్తువొక్కటియ యని వేదప్రమాణమును బట్టినచో స్థిరమగుచున్నది కావున "ఏకమేవా ద్వితీయ మనునది సార్థకమేను. ఆ బ్రహ్మమునుండి కామములేక మాయవెడలెను. అపుడు ద్వైతమువచ్చెను. పిదప సృష్టిక్రమమంతయును ద్వైతమేను. ఈ ద్వైతసృష్టిలోఁ గొన్ని యవ్యక్తములయ్యెను. గొన్ని వ్యక్తములయ్యెనుగాని మూలారంభమున సర్వమును గర్భములోనుంచికొని యుండినది బ్రహ్మమేను. అంతమున నుంచికొను నదియు బ్రహ్మమే కావున "ఏకమేవాద్వితీయ" మనునది సార్థకమేను.

ఈ మాయావాదమును దిరస్కరించి పరబ్రహ్మమునకు సృష్టింపవలెనని యాశపుట్టెననినచో ననేకములగు ననర్థవాదములు పుట్టును. ఆశ పనికిఁ బ్రేరేచును కావునఁ బరబ్రహ్మము కర్మమునర్ప మొదలుపెట్టె ననవలసివచ్చును. పరబ్రహ్మ కర్మములెల్లఁ బుణ్యకర్మములుగ నుండవలసివచ్చును. అటులయిన జగత్తులోఁ బాపమెటు వచ్చెను. సుఖదుఃఖములెటు కలిగెను. జనన మరణములెటు ప్రాప్తిల్లును. చేతనాచేతనములెటుగలిగెను. దైవమే మంచిచెడుంగులు పుట్టించెననిన దైవమునందే ద్వంద్వబుద్ధు లుత్పన్నములయ్యెనని యనవలసివచ్చును. అట్లైన ద్వైవత్వముననే కుందుగలుగును. మఱియొక కష్టమున్నది. సాంఖ్యుల ప్రకృతిపై నారోపింపఁబడిన యాక్షేపణయే యీ వాదముపైనను వచ్చును. సాంఖ్యుల ప్రకృతియే, కర్మస్వాతంత్ర్యము కలిగినది యనినపుడు పుణ్యపాపముల కర్మబంధముకూడా ప్రకృతికేయగుననియుఁ దన్నుఁదాఁ గట్టికొని విచ్చుకొనుటకు యత్నించుట సమ్మతింపఁదగినది కాదనియు నాక్షేపింపఁబడినది. పురుషుఁడు సృష్టికర్తయైనపు డదే యాక్షేపణము వచ్చునుగదా?

సృష్టిరహస్యము దైవమునకైనను దెలియునో తెలియదో యనినటుల నీ విషయ మెఱుంగుట కష్టతమమైనపని. అధ్యాత్మ సిద్ధాంతు లూహాలపై యుక్తివాదములు సలుపుచు జనులలో మతద్వేషములు పెంచుచున్నారు. కావుననే భగవద్గీతలో నన్నివాదములును సముచ్చయింప యత్నింపఁబడినది.

మాయావాదము పైనను ననేకములగు నాక్షేపణలున్నవి. అయిన పండితులగువారు వానికెల్ల యుక్తి సమాధానములు చెప్పను సాధ్యమగునని నాకుఁ దోఁచెడు. హిందూ సిద్ధాంతములలోను పాశ్చాత్య సిద్ధాంతములోను బ్రావీణ్యము నందిన యొకపండితుఁ డద్వైత సిద్ధాంతమురీతిగ నాత్మ పరమాత్మలో లీనమైనపుడు మానవుని జ్ఞానాభివృద్ధికి ( Spiritual advancement ) మార్గముండదని పలికినాఁడు. ఆశలుడిగి కర్మపాశములెల్లఁ దెంచి ప్రకృతి ప్రాబల్యమును బటాపంచలుగఁ బాఱఁదోలి బ్రహ్మతేజోమయుఁడైనపుడు బ్రహ్మతేజములోనే గలిసిపోవును. అట్టివానికి జ్ఞానాభివృద్ధి యననేమి? అట్టి యద్వైతభావన లక్ష్యముగ నుంచికొని యభివృద్ధినందఁ బ్రయత్నించినచోఁ గోటిజన్మములకైన నద్వైతసిద్ధి గలుగునని పలుకనగును. ప్రతియొక సిద్ధాంతపరిణామ మిటులనేయుండును.

బ్రహ్మము నిర్గుణమను వాదముపై నాక్షేపణలు మెండుగఁ గల్పింపఁబడినవి. ఈ యాక్షేపణము లన్నియును నిర్గుణ శబ్దార్థము లక్ష్యపెట్టక పుట్టినట్టివి. అద్వైతులు బ్రహ్మము నిర్గుణుఁడను వాక్యమునకు "సత్వరజ సమో" గుణములకు

లోఁబడినవాఁడు కాఁడని యర్థము. ఈ యర్థమునుబట్టి వేదాంతములోని యీ శబ్దమును సమన్వయించుకొను నెడల నిర్గుణవాద నిరసనమునకుఁ గారణమేమియు నుండదని నాకుఁ దోఁచెడు.

పైన నాచే వ్రాయఁబడిన సిద్ధాంతము లనుసరించినవారికి సత్కార్య వాదులనియు సాంఖ్యవాదులనియుఁ బరిణామవాదులనియు వివర్తవాదులనియు నిత్యాదినామములు వచ్చినవి. ఈ వాదముల యర్థము తెలిసినచో సిద్ధాంతము లేమైనదియు సూక్ష్మముగ నెఱుంగనగును. బ్రహ్మశ్రీ వావిలాల శివావధానుల వారు తామాంధ్రీకరించిన బ్రహ్మసూత్రములను గ్రంథములో నా వాదములన్నియును నచ్చటచ్చట వ్రాసినారు. వానినే నేనిదిగువ వ్రాసినాను. కొన్ని మార్పులు గలవు.

## స త్కా ర్య వా ద ము.

ఈ వాదము సాంఖ్యులది. వేదాంతులచే నంగీకృతము. కార్యము కారణ మందనేగా కారణస్వరూపముగ సూక్ష్మమైయుండి కార్యార్థులైన జనులచేఁ జేయఁ బడు వ్యాపారములచే వ్యక్తమగును. పాలలోఁ బెఱుఁగు సూక్ష్మరూపముగనుండి పెఱుఁగునుఁ గోరువారిచే జేయఁబడు (చేమిరి) తోడుఁబెట్టుటయను వ్యాపార ముచే నేర్పడుచున్నది. ఇటులనే కుండ మట్టియందు సూక్ష్మరూపముగనుండి, కుమ్మరిచేఁ జేయఁబడు వ్యాపారముచేఁ గుండఁగ నగపడుచున్నది. ఆ పెఱుఁగును, గుండయుఁ బాలయందును మట్టియందును లేనిచో జనుల వ్యాపారముచే నవి యెట్లు పుట్టును? లేనివి పుట్టునంటిరా, మట్టిలోనుండి పెఱుఁగు పుట్టవలెను. పాలలో నుండి కుండ పుట్టవలయును. అట్లు పుట్టుటలేదు. కారణములోఁ గార్యములేకయే క్రొత్తఁగాఁబుట్టునని తార్కికులందురు. అటులైనచో బాలలోఁ గుండ లేనట్లే పెఱుఁగును లేదుగానఁ బాలలోనుండి పెఱుఁగే పుట్టవలయును మట్టిలోనుండి కుండయే పుట్టవలెనను నియమము లేకపోవును. పాలలోఁ బెఱుఁగునుఁ బుట్టించు శక్తియును, మట్టిలోఁ గుండను బుట్టించుశక్తియును గలదని తార్కికులనియెదరు. ఆ శక్తియే కార్యమని సాంఖ్యయోగాద్వైత విశిష్టాద్వైతుల యభిప్రాయము. కార్యము “ కారణాత్మనా ” కారణమందున్నదని యద్వైతులును కార్యము సూక్ష్మరూపముగఁ గారణమందున్నదని సాంఖ్యులును నందురు. మాటమాత్రము భేదముగాని యర్థమొకటియేను.

## ఆ రం భ వా ద ము.

కారణమువలనఁ గార్యముపుట్టినపిమ్మట నా కారణ కార్యములను వేఱు

సేయుటకు వీలులేకున్నను గారణము కార్యముతోఁ గలసియున్నపుడుగాని వేఱుగా నున్నపుడుగాని వానిని వేఱువేఱుగఁ దెలిసికొనుట కవకాశమున్నది. ఇందులకు దృష్టాంతము. కారణములగు దారములనువిడిచి కార్యమగు బట్ట వేఱుగలేకున్నను బట్టయందు దారములున్నవియను వ్యవహారమందు బట్టవేఱుగను, దారములు వేఱుగను బిలువఁబడుచున్నవి. దీనిపే రారంభవాదము.

పరమాణువాదము.

అణువుల చేరికచే జగత్తు సృష్టియను వైశేషికుల వాదమిది. దీనిఖండన యుక్తి.

పరమాణువు లొకదానితోనొకటి కలిసి ద్వ్యణుకాది కార్యములను బుట్టించునపుడు, నొకపరమాణువు, మఱియొక పరిమాణువుతోఁ గలియునపుడు, సంపూర్ణముగఁ గలియునా? లేక యొకభాగముతోమాత్రము గలయునా? సంపూర్ణముగఁ గలిసెనని యందుమా? నిరవయవములుగాన సంపూర్ణముగ నెన్నిమార్లు కలసినను బరమాణువులుగానే యుండునుగాని సావయములు కానేరవు. సావయవములు కానపుడు వానిసంయోగమెక్కడ? దానివలన స్థూలపదార్థ సృష్టియెక్కడ? రెండవపక్షములోఁగూడ పరమాణువు నిరవయవముగాన నొకభాగముతోఁ గలియుననుటకు వీలు గలుగనే గలుగదు.

అవచ్ఛిన్నవాదము.

జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమైనచో జీవుని సుఖదుఃఖములు బ్రహ్మమునకుఁ గూడఁ గలుగవలయు. కరచరణాదులగు నంశములందుఁగల సుఖదుఃఖములు, అంశియగు దేహమునందుఁగూడ నున్నట్లు జీవునందుఁగల సుఖదుఃఖములు బ్రహ్మమందుఁగూడ నుండనోపునని శంకింపఁదగదు. ఏలయన:--జీవుని సుఖదుఃఖములు తదుపాధియగు బుద్ధియొక్క సంబంధమువలనఁ గలిగినవి. బ్రహ్మమునకు నుపాధిలేదుగాన నతనికి సుఖదుఃఖములు చెందవు. అది యెట్లనిన, సూర్యప్రకాశము కిటికీసందులోఁ బ్రవేశించినపుడు వంకరగ భాసించినను, ఆ వంకరగుణము సూర్యకాంతికిలేదు. నీటికుండలోఁ బ్రతిబింబించిన సూర్యప్రతిబింబమునకుఁ జలనాదిదోషములు గన్పట్టుచున్నను దదంశియగు సూర్యునందుఁ జలనాదులు లేనటుల, బుద్ధియందున్న జీవునిదోషములు బ్రహ్మచైతన్యమందుండవు. బ్రహ్మము సర్వబుద్ధులయందును జీవస్వరూపముతోఁ బ్రవేశించి యేకమైయుండఁగ, శత్రువుల నుండి తొలఁగిపోవలయుననియును, మిత్రుని సేవింపవలెననియును, లోనగు లౌకికాలౌకిక విధినిషేధములెట్లు సంగతములగుననిన, అగ్ని యేకమయినను శ్మశాన దేశ

సంబంధము కలిగినపుడది యగ్రాహ్యమనియు, శ్రోత్రియ గృహసంబంధము కలిగిన యెడ గ్రాహ్యమనియు నుపాధిభేదము ననుసరించి చెప్పినట్లు, ఉపాధి తారతమ్యము ననుసరించి యీ విధినిషేధములు ప్రవర్తించినవిగాని యాత్మతత్త్వమునుబట్టి వర్తించినవి కావు. జీవులు, అవిద్యాంతఃకరణములు లోనగు నుపాధుల నాశ్రయించి యుండుటచేతను ఉపాధులు పరిచ్ఛిన్నములు గనుకను, ఒకయుపాధిలోనున్న జీవుఁడు మఱియొక యుపాధిలో వ్యాపించుటకు వీలులేనందునను, ఆ యుపాధులయొక్క సుఖదుఃఖ పుణ్యపాపాదు లితరములగు నుపాధులయందు సంక్రమింపనేరవు. ఇదియే యవిచ్ఛిన్నవాదము.

ప్ర తి బిం బ వా ద ము.

ప్రతిబింబసూర్యులు, సూర్యుని యంశములైనట్లు జీవుని బ్రహ్మాంశమని చెప్పితిమిగదా? జీవుండేకమయినను నతని యుపాధులగు నవిద్యాంశములనేకములుగాన వానిలోఁ బ్రతిఫలించిన బ్రహ్మచైతన్యముగూడ ననేకములని వ్యవహరింపఁబడుచున్నవి. సూర్య ప్రతిబింబములలో నొకప్రతిబింబమునకుఁ జలచలనాదులచేఁ జలనాదులుగలిగినపు డితరప్రతిబింబములకు నా చలనాదులుగలుగనట్లు బ్రహ్మప్రతిబింబమగు నొకజీవుని సుఖదుఃఖాదు లితర జీవులకంటవు. బింబభూతమగు బ్రహ్మమునకు బొత్తిగనంటవు. ఇదియే ప్రతిబింబవాదము.

ప రి ణా మ వా ద ము.

కార్య కారణములకు స్వభావమున భేదమున్నను కార్యకారణ భావము గూడఁ గలదుగదా! దృష్టాంతము, పేఁడజడము, తేలుచేతనము. అయినను దానిలోనుండి తేలుపుట్టుచున్నది. పట్టుదారములకు వానిలోఁబట్టు పురుగులకు, నిదియే న్యాయము. కాన నచేతనమువలనఁ జేతనము పుట్టుచున్నది. మఱియుఁ జేతనము వలన నచేతనముఁగూడఁ బుట్టుచున్నది. మనదేహములోనుండి కేవలజడములగు గోళ్లు వెంట్రుకలు పుట్టుచున్నవి. సాలెపురుగు నోటిలోనుండి దారములు పుట్టుచున్నవి. గనుక సాంఖ్యకాణాదులు చెప్పుజడములగు ప్రధానపరమాణువుల వలన జడప్రపంచము పుట్టుననుని నియమములేదు. చైతన్యఖనియగు బ్రహ్మమువలన నచేతనరూపమగు ప్రపంచము పుట్టవచ్చుననుయుక్తి సయుక్తిముగను ననుభవసిద్ధముగనునున్నది. కార్యకారణములకు నభేదమున్నను గార్యములో నొకదాని కంటె మఱియొకటి వేఱుగనుండవచ్చును. దృష్టాంతము. మట్టివలనఁ బుట్టిన కుండయు, మూఁకుడు మొదలయినవియు మట్టికంటె భిన్నములుకాకపోయినను పరస్పరము భిన్నములేగదా? అటులనే, కారణమైన బ్రహ్మమునకును, కార్యము

లైన భోక్తృ (సుఖదుఃఖము లనుభవించుజీవుఁడు) భోగ్యములకు (సకల జడవస్తువులు వానివలనఁ గలుగుసుఖదుఃఖాదులు) ను అభేదము కలిగియున్నను భోక్తృ భోగ్యములొండొరులు భిన్నములుగ నుండవచ్చును. దృ:— సముద్రము నందుఁబుట్టిన బుగ్గలు అలలు సముద్రతత్త్వముకంటె భిన్నతత్త్వములు కాకపోయి నను అనఁగా జలవికారములయినను బుగ్గ లలకంటె వేఱుగనున్న వికదా? ప్రపంచము బ్రహ్మముయొక్క పరిణామమని చెప్పెడువారి సమాధానమును జెప్పుదురు. ఈ పరిణామవాదము సాంఖ్యయోగ విశిష్టాద్వైతులకు సమ్మతము. అద్వైతులకు నుపాసనాకాండము ప్రతిపాదించునపుడు సమ్మతము. అనఁగా మాయతోఁగూడిన బ్రహ్మము (సగుణబ్రహ్మము) ప్రపంచమునకు నుపాదానకారణమని చెప్పునప్పుడీవాదముసమ్మతము. కారణము తనస్వరూపముమారి కార్యమగుట పరిణామమని యిదివరలోనే చెప్పియుంటిమి.

వివర్తవాదము.

కారణము కారణస్వరూపము మారకయే, కార్యరూపముగ మారి నట్లగపడుట వివర్తమనఁబడును. నిర్గుణబ్రహ్మము జగత్కారణమని చెప్పునప్పుడు భోక్తృ భోగ్యప్రపంచము బ్రహ్మముకంటె వేఱుగలేదు. ముత్యపుఁ జిప్పభ్రమచేత వెండివలెఁగనఁబడినట్లు, బ్రహ్మమే యజ్ఞానముచేఁ బ్రపంచముగఁ గనఁబడుచున్నది. కావున బ్రహ్మమేసత్యము ప్రపంచము మిథ్యలేక యనిర్వచనీయముకాని బౌద్ధుల లోని శూన్యవాదులు చెప్పు కుందేటికొమ్మువలెఁ దుచ్ఛముకాదు. సత్యమన మూఁడు కాలములయందు దేనిచేతను బాధింపఁబడక యుండునది. మిథ్యలేక యనిర్వచనీయ మనఁగా యిదియని యెదుటనున్నట్లగపడి, విమర్శింపఁగా లేకపోవునది. ఎండమావులు, శుక్తిరజతము, రజ్జుసర్పము. ఇందుల కుదాహరణములు భ్రమకాలములో నీరుగాను వెండిగాను పాముగాను గనఁబడినను విమర్శమీద భ్రమనివారణకాఁగా, యా నీరుమొదలైనవి లేనివైతోఁచును. అట్లే ప్రపంచముఁగూడ వ్యవహారకాలము నందు గనఁబడుచున్నప్పటికిని శ్రుతియుక్త్యనుభవములచే విమర్శింపఁగ బ్రహ్మాత్మైక్య జ్ఞానముదయించినతోడనే. బ్రహ్మముకంటె వేఱుగఁగనఁబడదు. ఇత్యాదిహేతువులనుఁ బురస్కరించి ప్రపంచము మిథ్యయనుట యద్వైతులసిద్ధాంతము. దీనినే వివర్తోపాదానమందురు. ఈ వాదమునకే మాయావాదమని రూఢి.

శ్రీశంకరాచార్యులకు బహుకాలమునకుమున్నే పైవాదములన్నియును నుండెను. ఉపనిషత్తులలోని కొన్నిశబ్దములే యీ సమస్తవాదములకు మూలాధారములైనవి. శ్రీశంకరాచార్యులు మాయావాదము ననుసరించి భాష్యములు

వ్రాసిరి. అంతకుమున్నే బోధాయనులవారు పరిణామవాదమునను సరించి బ్రహ్మ సూత్రములకు భాష్యము చేసియుండిరి. శంకరాచార్యులవారు తమభాష్యములో బోధాయన భాష్యములోని కొన్ని యంశములను ఖండించిరి. పిదప మూఁడువందల సంవత్సరముల పిదప శ్రీరామానుజాచార్యుల వారవతరించి బోధాయన భాష్యము ననుసరించి శ్రీ శంకరాచార్యులవారి మాయావాదములో విశేష భాగము ఖండింప యత్నించిరి. శ్రీ శంకరాచార్యులవారి మాయావాదమే భరతఖండమున నేల పాశ్చాత్య ప్రపంచములో నైతము విశేష ప్రసిద్ధినందినది. ఇటీవల నేను సీతానాథతత్త్వభూషణముగారి గ్రంథములు చదువుచుండఁగ వారు శ్రీ రామానుజాచార్యులవారి విషయమును బలుకుచు శ్రీ రామానుజాచార్యులవారు తార్కిక ప్రావీణ్యము గలవారనియు శ్రీ శంకరాచార్యుల వారధ్యాత్మిక జ్ఞానప్రావీణ్యము గలవారనియు వ్రాసినారు. వారిరువురున్ను గొప్పజ్ఞానులనుటకు సందియము లేదు. శ్రీ శంకరాచార్యులవా రేకత్వమును సాధించిరి. శ్రీ రామానుజాచార్యులవా రేకత్వములో భిన్నత్వమును సాధించిరి. పిదప శ్రీ మధ్వాచార్యులవారు సంపూర్ణభిన్నత్వమును సాధించిరి. జనుల యాధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికి వీరు కారకులనుట కేసందియము లేదు. అయితే వీరిసిద్ధాంతముల నవలంబించినవారు తామనుసరించిన సిద్ధాంతములే హెచ్చని వాగ్వాదములు బెంచి మతద్వేషములు హెచ్చింపఁజేసిరి. భరతఖండములో శ్రీ రామానుజాచార్యులకుఁ బూర్వము దేవాలయము లేగాని విగ్రహారాధనలేగాని విశేషముగనుండలేదు. బహుకాలమునకుమున్నే పాంచరాత్రాగమ విధానములుండెనుగాని దానికి నంతటిప్రాచుర్య ముండలేదు. శ్రీ రామానుజాచార్యులవారా పాంచరాత్రాగమములను దమమతములోఁ జేర్చినందున దానికి హెచ్చు ప్రాచుర్యమువచ్చెను.

మాయావాదమును స్థిరపఱచునట్టి గాథ లనేకములున్నవి బహుకాలము నుండి జనులనోటిలో నాడుచున్నవి. అన్నియును వ్రాయక యొకగాథనుమాత్రము వ్రాసి యీ యుపన్యాసంబింతటితో ముగించెద.

“ఒకానొక దినంబున నారదఋషి భగవంతునిఁగూడి సంచరించుచు మార్గమున “మాయ” యన నేమియని ప్రశ్నించెనఁట. అది యనిర్వచనీయమని భగవంతుఁడు బదులిడి మాటలాడుచు నడచుచుండ మార్గమున నొకయువతి మనోహరాకారంబుఁదాల్చి తన సుందరముఖచంద్రమునుండి చిఱునగవను వెన్నెలఁ బ్రసరింపఁజేయుచుఁ దనవిశాలలోచన కటాక్షబాణములఁ జూపరుల ధైర్య మేపు

మాపుచు వారు ముందఱుగిడనటులఁ దన కేశపాశముల బంధించుచు హొయలు గులుకుచు మోహినీదేవతయో యనునటులఁ గట్టెదుటఁ గనఁబడెనఁట. దానినిఁ జూచినతక్షణముననే నారదులకు నింద్రియనిగ్రహము చెడి బ్రహ్మచర్యవ్రతము పటాపంచలయి యా మందగమనను వెంబడించి యరణ్యములోనున్న దానికుటీరము ప్రవేశించి యా వెలఁది యెంతగ వలదని బతిమాలినను వదలక బలాత్కరించి సంసారచక్రములోఁబడి మోహాంధకారములో మునింగి చిక్కులఁబడుచు, సంతానవృద్ధి యయిన పిల్లలను పారిరక్షణార్థము కష్టపడుచుండెనఁట. ఒక్కదినంబునఁ గళత్రపుత్రసహితుండై నారదుఁడు దోవనడచుచుండ యొకయేరడ్డపడెను. అందు నీరుండని కారణంబున దానిని దాఁటుచుండఁ బ్రవాహము హెచ్చుగవచ్చి పుత్రకళత్రాదులు కొట్టికొని పోయిరఁట. నారదుఁడుమాత్రము శ్రమపడి యెట్టకేలకుఁ దీరముఁజేరి యపారిగ దారపుత్రాదులను దలంచికొని పరితపించుచుండెనఁట. అంతలోనే భగవంతుఁడొక ముదసలి బ్రాహ్మణవేషమునుదాల్చికొని వచ్చి నారదుని సమీపించి పరితాపంబునకుఁ గారణంబు విచారింప నారదుఁడు తన దారపుత్రాదుల వియోగము చెప్పి దుఃఖింపసాగెనుగాని తానెవరయినదిన్ని తెలుపఁజాలక పోయెనఁట. అపుడు భగవంతుఁడు నారదుల యజ్ఞానంబుఁ దొలఁగింపఁగనే నారదులకు పూర్వస్మరణవచ్చి భగవంతునకు నమస్కరించెనఁట. భగవంతుఁడపుడు నారదా! “ మాయ ” యన నేమని నన్నుఁ బ్రశ్నించితివి. అనిర్వచనీయమదియని నేఁదెలుప దానివిషయము మఱలమఱలఁ బ్రశ్నింపసాగితివి. దానినిఁ దెలియుటకు స్వానుభవమే కారణమని యెంచి నిన్ను మాయలో ముంచితిని. ఇపుడు “మాయ” యనునది యెట్టిదియను సంగతి నీకుఁ దెలిసెనుగదా? అనుభవమునకు వచ్చెనుగదా? యని యంతర్థానమయ్యెనఁట. ఇట్టిగాథలు యోగవాశిష్ఠములో హెచ్చుగనున్నవి.

ఈ మాయావాదమునుగుఱించి బ్ర॥ బాలగంగాధర తిలక్కుగారు తమ గీతారహస్యమను గొప్పగ్రంథములో యుక్తియుక్తముగ మహారాష్ట్రభాషలోఁ జర్చించినవిషయమును సంక్షేపముగ భాషాంతరీకరించి క్రింద వ్రాసినాఁడను.